నవలల పోటీలో
మూడవ బహుమతి
పొందిన నవల

# దాగుడుమూతలు

ఆ అమ్మాయిని చూస్తే నాకెందుకో బాగా యేడిపించాలని ...ది. అలా ఎందుకనిపించాలి? ఆ అమ్మాయిలో వున్న ప్రత్యేకత యే..టి? — అని నన్ను నేను ప్రశ్నించుకునేవాడిని.

ఆ అమ్మాయిని యేడిపించాలన్న నాలోని కోరికకు కారణం ...ని 'మొగబుద్ధి' అనుకుంటాను. తరతరాలుగా ఈ దేశంలో ...షులలో ఆదర్శస్త్రీ అంటే ఎలా వుండాలో ఒక ఖచ్చితమైన ...యం యేర్పడివుంది. ఆదర్శస్త్రీ అంటే ఎంతో వినయంగా, అణ...గా వుండాలి. గలగలా మాట్లాడకూడదు. పురుషుల్తో ఫ్రీగా ...లకూడదు. ఆమెలో సిగ్గూ భయం వాటిపాలు చాలా ఎక్కు... వుండాలి. ఎవరూ అడక్కుండానే తన అభిప్రాయాలు టకీ... చెప్పకూడదు. పగలబడి నవ్వకూడదు. జోక్స్ చెయ్యకూడదు. ...ని చేసినా చాలా సున్నితంగా చెయ్యాలి. పదిమందిలో కొన్ని ...క్స్‌ని స్త్రీలు అసలు టచ్ చెయ్యకూడదు. అందులో ముఖ్యంగా ...ని గూర్చి అస్సలు మాట్లాడకూడదు— ఇవీ ఈ దేశంలోని ఆదర్శస్త్రీలో వెతికే గుణాలు— ఇలా ఉండని స్త్రీని

గుంచ్చి ఈ దేశంలో ప్రతిమొగవాడూ నాలాగే ఆలోచిస్తే
ఈమెలో సంసార స్త్రీ లక్షణాలేవీలేవే! పెద్దహీరోయిన్ అ
టుంది కొంచెం ప్రయత్నిస్తే మనకూ దొరికిపోతుంది....
స్త్రీని గూర్చి చాలా నీచంగా చెప్పుకోవటం, పుకార్లు లేవదీ
ప్రారంభమౌతుంది. సూటిపోటిమాటలతో ఆ అమ్మాయిని
పరచాలి.... యేడిపించాలి.... ఒక్కసారి అలా యేడిపించాక
మనంవిజయగర్వంతో ఊగిపోతాం.... ఎందుకంటే మనముం
యేడ్చింది కదా.... అంటే.... అఫ్టరాల్.... ఓ ఆడదన్న మా
షన్వ్వా ఓ ఆర్డినరీ ఆడదానివేనని మనం ఋజువు చేశామన్న

నాకు చైతన్యను చూపినప్పుడల్లా ఆమెను ఎలాగైనా
పించాలన్న కోరిక కల్గడానికి కారణం ఇదేననుకుంటాను.

నేను కాలేజిలో చదువుకునే రోజుల్లోనే నాలో యిలా
మనస్తత్వం ఏర్పడిందనుకుంటాను—

కాస్తఅందంగా చలాకీగా, డేషిల్ మేకేర్ అన్నపిర్లక్ష్యంతో
నిర్భయంగా కన్పించే ఆడపిల్లలనుయేడిపించే ప్రయత్నంచేసేవాడిని.
ఆ ప్రయత్నం కొన్నిసార్లు ఫలించేది— కొన్నిసార్లు బెడిసికొట్టిన
సందర్భాలు కూడా లేకపోలేదు - 'ఆడపిల్లల్ని యేడిపించటంలో
ఘనుడు' అన్న ఇమేజ్ని మాత్రం సంపాదించుకోగల్గాను - సమా
జంలో మనకొక ఇమేజ్ యేర్పడిందంటే సాధ్యమైనంతవరకూ
మనమూ ఇమేజ్ను కాపాడుకోవటానికే ప్రయత్నిస్తాము. ముఖ్యంగా
మన ఆరంభయౌవనంలో—అంటే ఎడొలసెంట్ పీరియడ్లో— మన
మీద సమాజంవేసే ముద్రను మనం మన జీవితాంతం కాపాడు
కుంటూనే వుంటాము. పదిమంది ఒకడ్ని 'వీడొట్టి రౌడీ' అన్నా
రనుకోండి— వాడు రౌడీ అయితీర్తాడు। మరొకడ్ని 'వీడొట్టి
అమాయకుడు' అన్నారనుకోండి వాడు నిజంగా అమాయకుడు కాక
పోయినా అమాయకుడిలా నటించి అమాయకుడిలా వుండటంలో
సమకూరే లాభాల్ని పొందటానికి ప్రయత్నిస్తాడు. ఇంకొకడ్ని
"వీడు ఆడపిల్లల్ని యేడిపించటంలో ఘనుడు - అపర శ్రీకృష్ణావ
తారం" అన్నారనుకోండి—వాడు తనమీదపడిన ఆ ముద్రను ఒక
గొప్ప క్వాలిఫికేషన్లా తీసుకుని అలావుండటానికి ప్రయత్ని
స్తాడు— నావిషయంలో ఇదేజరిగింది.

అయితే ఒకవ్యక్తియొక్క సమాజం ఒక ప్రత్యేకమైన ముద్ర
వేయటానికి సహజంగా ఆవ్యక్తిలోవున్న కొన్ని ప్రవృత్తుల
కారణంగానే జరుగుతుందంటే నేను ఒప్పుకుంటాను. కాని
సమాజం వాడిమీద అలాంటి ముద్ర వెయ్యకపోతే వాడి అంత
రంగంలో అణిగిమణిగి వుండే ఆ సహజ ప్రవృత్తులు అంతగా
బహిర్గతం అయ్యేవి కావనుకుంటాను. ప్రతివాడిలోనూ కొన్ని
సహజ ప్రవృత్తులుంటాయి. అవి బహిర్గతం కావాలంటే వాటిని
సమాజం ఆమోదించాలి సమాజం ఆమోదించని ప్రవృత్తుల్ని
వ్యక్తులు సాధ్యమైనంతవరకు తమలోనే అణిచివేసుకోవటానికి
ప్రయత్నిస్తారు. కాని ఒక వ్యక్తిని "పీడిలాంటివాడు" అని
సమాజం గుర్తించటంతో ఆ వ్యక్తిలో ఎక్కువ చైతన్యవంతంగా
వున్న ప్రవృత్తులను సమాజం ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ
ఆమోదించినట్లన్నమాట!

* * * *

పదిరోజుల క్రితమే చైతన్య మా ఆఫీసులో ఎల్.డి.సి.గా
చేరింది. చైతన్యతోబాటు మరో ముగ్గురు ఆడపిల్లలుకూడా
మా ఆఫీసులో చేరారు.

అంతకుముందు మా ఆఫీసులో ఆడపిల్లలెవరూ పని
చెయ్యటంలేదు. అసలు మా ఆఫీసే కొత్తగా ఏర్పడింది ఇదివరకు
హనుమకొండ వరంగల్‌కు కలిపి ఒకటే ఆఫీసుండేది వరంగల్
కోసమని ప్రత్యేకంగా కొత్త ఆఫీసు నొకదాన్ని ఏర్పాటు
చెయ్యాలని మా మేనేజిమెంట్ ఇటీవలనే ఒక నిర్ణయం తీసుకుంది
ఆ నిర్ణయం మేరకే ఈ ఆఫీసు ఏర్పడింది

ఒకేసారి నలుగురు ఆడపిల్లల్ని అప్పాయింట్ చెయ్యటంతో
మా ఆఫీసులో పెద్ద సంచలనమే కలిగింది.

మావాళ్ళు మా ఆఫీసర్‌ను గూర్చి రకరకాలుగా చెప్పు
కున్నారు.

ఇంటర్వ్యూకు 60 మందిదాకా అభ్యర్థులువచ్చారు. అందులో
50 మంది మగవాళ్ళు - 10 మంది ఆడవాళ్ళు - అందులో మా
ఆఫీసర్ పనిగట్టుకుని ఈ నలుగురు ఆడపిల్లల్ని సెలక్ట్ చెయ్య
టంతో మా ఆఫీసులోని మగవాళ్ళందరికీ అమితమైన ఆగ్రహం

కష్టాలు. మగవాడికి తీరని అన్యాయం, అవమానం జరిగిపోతున్నట్టు ఫీలయ్యాను

ఆ రెండు మూడు రోజులూ లంచ్ టైములో అందరమూ క్యాంటిన్ చేరినప్పుడు మా అందరికీ యిదే టాపిక్.

"ఆఫీసర్‌గారికి ఆడపిచ్చి ముదిరిందిలా?" - అంటాడు ఎకౌంట్స్ సెక్షన్‌లో పనిచేసే మధు.

"అసలీ ఆడవాళ్ళకి ఉద్యోగాలెందుకురా?" ఎవడ్నో ఒకడ్ని పెళ్ళిచేసుకుని పిల్లల్నికంటూ ఇంట్లో పడుంటే పోలా? దేశంలో మగజనమంతా నిరుద్యోగంతో ఛస్తుంటే వున్నకాస్త ఉద్యోగాల్ని ఈ ఆడపిల్లలు తన్నుకుపోతే ఈ దేశంలోని మగ వాళ్ళంతా యేమైపోవాలి? అంటాడు ఎస్టాబ్లిష్‌మెంట్ సెక్షన్‌లో పనిచేసే మురళీధర్‌రావు.

"మన ఆఫీసుకు రాబోయే ఆ నల్గురు ఆడవాళ్ళని గూర్చి తెలుసుకున్నాను. ఆ నల్గురూ బాగా వున్న కుటుంబాలకు చెందిన వాళ్ళే - అందరూ గెజిటెడ్ ఆఫీసర్ల కూతుళ్ళే - వాళ్ళకెందుకు చెప్పు ఈ బోడి ఉద్యోగాలు.... ఏ పేదవాడికన్నా యిస్తే బతికి పోయేవాడు. వీళ్ళొచ్చి పనిచేస్తారా పాడా? ఏమన్నా అంటే ఏడుపు మొహంపెడ్తారు. ఆడవాళ్ళతో దురుసుగా ప్రవర్తిస్తున్నామని ప్రచారం చేస్తారు. నాలుగురోజులు పోగానే మెటర్నిటీ లీవంటారు.... నన్నడిగితే ఈ ఆడవాళ్ళకు ఉద్యోగాలివ్వడమంత బుద్ధితక్కువపని మరొకటి లేదంటాను...." - అంటాడు ఎకౌంట్స్ సెక్షన్ సూపరింటెండెంట్ సూర్యారావు.

"బాగా చెప్పావు గురూ.... అసలు ఈ ఆడవాళ్ళంత తెలివైనవాళ్ళు యెవరూలేరు.... ఒకపక్క మేము అన్నిరంగాల్లోనూ మొగవాళ్ళతో సమానమంటారు.... మరోపక్క వీళ్ళకు అన్ని చోట్ల రిజర్వేషన్లు.... స్పెషల్ ప్రివిలేజెస్ కావాలంటారు.... బస్సుల్లో స్పెషల్ సీట్లు, ట్రయిన్స్‌లో స్పెషల్ కంపార్టుమెంట్సు.... కాలేజీల్లో సీట్లు రిజర్వేషన్లు.... ఉద్యోగాల్లో రిజర్వేషన్లు.... వాటీజ్ దిస్? ఇక ఈ మగవాళ్ళెక్కడ చావాలి?.... మగవాళ్ళకు జరుగుతున్న అన్యాయాల్ని చూస్తుంటే నా గుండెలు మండిపోతున్నాయి.

మనమంతా ఆడవాళ్ళను బ్యాక్ టు ది కిచెన్స్‌కు పంపించాలన్న ఉద్యమం మొదలెట్టకపోతే ఈ దేశంలోని మగవాళ్ళకు భవిష్యత్తు లేదుగాక లేదు...." – ఆవేశంలో కొట్టుకుపోయాడు. బ్రైపిస్టుగా పచ్చేవే దామోదర్.

"ఇంతకూ.... రేపు మన ఆఫీస్‌లో జాయిన్ కాబోయే ఆ నల్గుర్లో మన ఆఫీసర్ ఏంచూసి ఉద్యోగా లిచ్చాడంటావు?" అన్నాడు ఎప్పుడూ బూతు జోకులుచెప్పి అందర్నీ నవ్వించే రాజశేఖరం....

"అదీ నువ్వే చెప్పాలి!" అన్నాడు దామోదరం. అందుకు జవాబుగా రాజశేఖరం ఓ బూతుమాట అనగానే అందరూ గొల్లున నవ్వారు.

"ఆడవాళ్ళని అపాయింట్ చేశాడని మనమింత కుళ్ళు చావాల్సిన పనిలేదు.... మన ఆఫీసర్ ఎలాంటివాడో మన కందరికీ తెలుసు.... వాళ్ళ ఇంటర్వ్యూల్లో పర్ఫార్మెన్స్ చూసే వాళ్ళకి ఉద్యోగాలిచ్చి వుంటారు. హీ యీజె వెరీ స్ట్రిక్ట్ ఫెల్లో...."— అన్నాడెవ్వరో.

"అందరూ స్ట్రిక్ట్ ఫెలోసే లేవయ్యా.... కాని శాస్త్రం ఏం చెప్పింది? అడదాన్ని చూసినా, అర్థాన్ని చూసినా.... బ్రహ్మకైనను పుట్టు రిమ్మ తెగులు.... అని చెప్పలేదూ.... మన ఆఫీసర్ బ్రహ్మ కన్నా గొప్పవాడా!" అన్నాడు సూర్యారావు అందరికేసి "చాలా గొప్పగా చెప్పాను కదూ" అన్నట్టుగా చూస్తూ—

"చాలా గొప్పగా చెప్పావు గురూ....!" అన్నాడు రాజశేఖరం సూర్యారావుతో షేక్‌హేండ్ చేస్తూ....

"అంత గొప్పగా చెప్తే వట్టి షేక్‌హేండేనా యిచ్చేది?"

"లేదు గురూ.... ఈ రోజు రాజశేఖరం అందరికీ టీలు తాగిస్తాడు" అన్నాడు దామోదరం.

రాజశేఖరం మరో రెండు బూతుజోకులు చెప్పి, అందర్నీ నవ్వించి అందరికీ టీలు తాగించాడు.

స్త్రీ అంటే పురుషుడిలో యిలాంటి తేలికభావం ఎందుకు కలుగుతుంది? ఓ అందమైన స్త్రీకి ఉద్యోగం దొరికితే అది ఆమెకు మెరిట్ వల్లనే దొరికిందని అంగీకరించడానికి పురుషుడెందుకు

[illegible] లాంటి పోర్న స్త్రీమీద చెప్పే ఆ బూతు జోకుల్ని ఎంజాయ్ చెయ్యటానికి ఈ పురుషుల్లోని సంస్కారం ఎందుకడ్డం రాదు? వీటన్నిటికీ కారణం ఒకటేననుకుంటాను.... స్త్రీని పురుషుడు సెక్స్ ఆబ్జెక్టులా కాకుండా మరోలా చూడలేకపోవడం— స్త్రీ అనగానే ఆమె ఎవడో ఒక పురుషుడి సెక్స్ కోరికల్ని తీర్చటానికే ఈ భూలోకంలోకి తీసుకురాబడిందన్న భావం పురుషుడిలో కల్గుతుంది.... స్త్రీ పుట్టింది ఎవడో ఒకడ్ని పెళ్ళి చేసుకోవడానికి.... వాడికి పిల్లల్ని కనటానికి.... లేకపోతే ఎవడితోనో వ్యభిచరించడానికి... ఇంతే! పురుషుడు స్త్రీని ఇలా తప్ప మరోలా చూడలేని సంస్కారం ఈ మగజాతి రక్తమాంసాల్లో ఇంకిపోయింది....

స్త్రీ కూడా మనలాంటి ఓ మానవజీవి.... మనలాగే ఆమెలోనూ మనస్సుంటుంది.... కోరికలుంటాయి.... సెంటిమెంట్స్ వుంటాయి.... ఆలోచన్లుంటాయి.... బలహీనతలుంటాయి షీ యీజ్ జస్ట్ లైక్ అజ్.... మనలాగే ఆమెకూడా ఒకమనిషి అని పురుషులకు తెలియదా? తెలీకని కాదు.... తెలిసినా దానికంత ప్రాధాన్యం ఇవ్వరు. స్త్రీ అనగా పురుషుడికి కల్గేభావం.... సెక్స్.... సెక్స్.... సెక్స్.... పురుషుడిలో చెలరేగే సెక్స్ కోరికల్ని తీర్చుకోటానికి ప్రకృతి సృష్టించిన సాధనం స్త్రీ.... అంతే! దీని కతీతమైన సంస్కారం పురుషుల్లో ఆవిష్కరింపబడటం.... ఇప్పట్లో అసాధ్యమనుకుంటాను.

* * * *

చైతన్యతో మొదటిపరిచయమే పోట్లాటతో ప్రారంభమైంది మా ఆఫీసర్ ఆరోజు అమ్మాయిల్ని మాకు పరిచయంచేశాడు "షీ ఈజ్ చైతన్య.... కంప్లెయింట్ సెక్షన్లో వర్క్ చేస్తుంది ... షీ ఈజ్ లీల.... ఎకౌంట్స్ సెక్షన్లో జాయిన్ కండి.... షీ ఈజ్ ఉమా.... ఎస్టాబ్లిష్ సెక్షన్ చూడండి.... షీ ఈజ్ సుల్తానా.... స్టెనోగ్రాఫర్...."

"అందరూ నమస్కారాలు చేశారు."

"మీరు మీ సూపరింటెండెంట్స్‌తో మీ వర్కేమిటో తెల్సుకోండి.... త్వరగా నేర్చుకుని అడ్జస్ట్ అవండి.... ఐ హోప్ యూ విల్ డూ యువర్ బెస్ట్...."

"ఓ.కే. సర్.... ! డెఫినెట్లీ సర్ !"— అంటోంది. ఆ నలుగుర్లో ఒకమ్మాయి. నా దృష్టి ఆ అమ్మాయిమీద పడింది.

వెంటనే నాకు కలిగిన అభిప్రాయం - "ఈ అమ్మాయి చాలా చలా కీగా వుంది." - అని.

ఆఫీసర్ తన గదిలోకి వెళ్ళిపోయాడు.

మిగతా అమ్మాయిలు వాళ్ళవాళ్ళ సెక్షన్స్‌లోకి వెళ్ళిపోయారు.

చైతన్య మా సెక్షన్‌లోకొచ్చింది. నేనుకూడా కంప్లైయింట్ సెక్షన్లోనే వర్క్ చేస్తాను

మా సూపరింటెండెంట్ మాధవరావు దగ్గరికొచ్చి—"నమస్కారం సార్.... మా సెక్షన్ సూపరింటెండెంట్‌గారు మీరేననుకుంటాను ?" అంది చైతన్య.

"ఔను.... ఆ సీట్లో కూర్చోండి...." అన్నాడు మాధవరావు తనుచూస్తున్న ఫైల్స్‌లోంచి తల ఎత్తకుండనే.

నేనా అమ్మాయిని గమనిస్తున్నాను. చాలా కాన్ఫిడెంట్‌గా వెళ్ళి ఆ సీట్లో కూర్చుంది. కాసేపు అటూ యిటూ చూసింది. ఒకసారి నాకేసి చూసింది నేను ఏదో పనిచేస్తున్నట్టు నటిస్తున్నాను.

"నేను చేయ్యాల్సిన పనేమిటో చెప్తారా సార్...." అన్నట్టుంది ఆకస్మాత్తుగా అందామె.

మాధవరావు ఆ మాటను విన్పించుకున్నట్టు లేదు.

"మీరు చేయ్యాల్సిన పనేమీలేదు. రోజూ హాయిగా ఇలాగే కూర్చుని నెలాఖర్లో జీతం తీసుకుపోవచ్చు"— అప్రయత్నంగా అన్నాన్నేను.... నేనలా అనటానికి కారణం సాధారణంగా ఆ సెక్షన్లో పనేమీ వుండదు. నా మాటలో నాకు తెలియకుండానే ఒక రకమైన నిర్లక్ష్యభావం ధ్వనించినట్టుంది.

"ఓహో, అంటే నా పనికూడా మీరే చేస్తారన్నమాట! వెట్టి చాకిరీ రద్దుచేశారని ఇటీవలనే పేపర్లో చదివానే....?" చాలా నిర్లక్ష్యంగా, ఒకరకమైన తేలిక భావం ధ్వనించేట్టు అందామె.

ఈ రోజే ఈ ఆఫీసులో జాయినయిన ఓ ఆడపిల్ల యింత నిర్లక్ష్యంగా మాట్లాడుతుందనుకోలేదు షాకైపోయాను. కొన్ని క్షణాలవరకు ఆమెకు యేమని సమాధానం చెప్పాలో తోచలేదు.... కాని ఏదో చెప్పకపోతే నా పరువుగంగలో కలుస్తుంది. ఇంతకాలం నాకీ ఆఫీసులోవున్న పరపతి నాశనమైపోతుంది.

నేను నవ్వటానికి ప్రయత్నిస్తూ అన్నాను...." ఓహో,

...లు ...న్న ముఖం.... కాప టురి చదివ
పేపర్లు చాలా పాతవిలాగున్నాయే....ఏదన్నా షాపింగ్ చేసివచ్చినప్పుడు
ప్యాకెట్స్ కట్టడానికి ఉపయోగించే పేపర్లు చదివేట్టున్నారు" -

"కరక్ట్ సార్.... సరిగ్గా అలాంటి పేపర్లోనే నేనీ ఆఫీసులో
వేకెన్సీస్ వున్నాయని చదివి అప్లై చేశాను.... ఇంటర్వ్యూకు
పిలిచారు.... సెలక్ట్ చేశారు.... ఉద్యోగం దొరికిపోయింది...
చూశారా.... పాత పేపర్లు చదవటంలో ఎంతలాభం వుందో...." -
చైతన్య గబగబా మాట్లాడేసింది.... అక్కడున్నవాళ్ళంతా నవ్వే
శారు. ఆమె ఏం మాట్లాడుతున్నదో కొంతసేపటివరకు నాకర్థం
కాలేదు. ఓ ఆడపిల్ల.... కొత్తగా ఉద్యోగంలో చేరిన ఆడపిల్ల....
బిక్కుబిక్కుమంటూ ఏడుపు ముఖంతో అందర్నీ ప్రాధేయపూర్వ
కంగా చూస్తూ కూర్చోవల్సిన ఆడపిల్ల.... ఇంత వేగంగా మాట్లాడు
తుందా? షి ఈజ్ టెర్రిబుల్ ఫాస్ట్ అనుకున్నాను.

"ఔనౌను.... పాత పేపర్లు చదివిన విజ్ఞానంతోనే ఇంట
ర్వ్యూలో ఆఫీసర్‌గార్ని ఇంప్రెస్‌చేసి వుంటారు...."- అన
బోయాను. నామాట పూర్తికాకుండానే -

"నేనసలు ఇంప్రెస్ చెయ్యలేదండి.... ఆయనే ఇంప్రెస్
అయిపోయాడండి. ఏంచేస్తాం చెప్పండి. పిల్చి ఉద్యోగం యిస్తా
మంటే కాదంటామా.... సరదాగా ఓ నాల్గురోజులు మీ అందరి
మధ్య గడిపి పోదామని జాయినయ్యాను...." -

"అమ్మా....సరదాగా గడపటానికిదో క్లబ్బో, పిక్నిక్ హాలో
కాలేజో కాదు.... గవర్నమెంట్ ఆఫీసు.... నువ్విలాగే గబగబా
మాట్లాడేస్తూ అందర్నీ మాట్లాడించావంటే ఈ ఆఫీసులో ఒక్క
ఫైలూ కదలదు...."-అన్నాడు మాధవరావు చాలా చిన్నగా మొహం
పెడ్తూ....

"భలే జోకేసారు సార్.... ఆఫీసుల్లో....అందులో గవర్న
మెంట్ ఆఫీసుల్లో ఫైళ్ళు కదుల్తాయంటే యెవరైనా నవ్వుతారు
సార్...." - ఆ అమ్మాయి సాహసాన్ని అభినందించకుండా వుండ
లేకపోయాను ఆ అమ్మాయి అన్నమాటకు కడుపుబ్బా నవ్వాలని
పించింది.... కాని ఇందాక నన్నామె అవమానించిందని గుర్తొ
చ్చింది.... వస్తున్న నవ్వును బలవంతంగా ఆపుకున్నాను.

మాధవరావు చాలా సీరియస్‌గా మారిపోయాడు.

"అమ్మాయి! ఏమిటి నీ ఉద్దేశ్యం....బాయినయి పది నిమిషాలయిందో లేదో ఇష్టంవచ్చినట్లు మాట్లాడుతున్నావేమిటి?"

"మాట్లాడక ఏం చెయ్యమంటారు? నేను చెయ్యాల్సిన పనేమిటో చెప్పమంటే మీరు చెప్పలేదుగా!"

"ఇదిగో మిస్టర్ విక్రమ్....నిన్న మొన్న వచ్చిన కంప్లెయింట్స్ ఆమె ముందువదేసి వాటిని రికార్డు చెయ్యటం ఎలాగో ఆమెకు చూపెట్టండి...." అన్నాడు మాధవరావు నన్నుద్దేశించి.

"వెట్టిచాకిరీ రద్దు చేశారని ఆమెగారు ఇప్పుడే సెలవిచ్చారు. మీరేమో నన్ను వెట్టిచాకిరీ చెయ్యమంటున్నారు"

"వెట్టి చాకిరీ అని ఎందు కనుకుంటున్నారు? మీశ్రమకు ప్రతిఫలం లభించకపోతే మీది వెట్టిచాకిరీ అవుతుంది....నేనేం మీశ్రమను వుంచుకోనులెండి...." అందామె నవ్వుతూ నాకేసి చూస్తూ....

"యేమిస్తారు."

"మీ శ్రమకు తగిన ప్రతిఫలం...."

"నా శ్రమకు తగిన ప్రతిఫలం యేమిటో మీకు తెలుసా?"

"తెలీదు.... చెప్పండి...."

"చెబితే యిస్తారా?"

"తప్పకుండా."

"అవసరమొచ్చినప్పుడు తీసుకుంటాను లెండి"

"ఆల్‌రైట్....అగ్రీడ్...."

ఎందుకో ఆ అమ్మాయితో మాట్లాడుతోంటే ఇంకా మాట్లాడాలనిపిస్తోంది ఆ అమ్మాయి నన్ను యింతకుముందు అవమానించిందన్న విషయం మరచిపోయాను....

ఆమె చెయ్యాల్సిన పనేమిటో చెప్పటానికి ఫైలు తీసుకుని ఆమెదగ్గరకెళ్ళాను

"ఇదిగో.... చూడండి....రోజూ మన ఆఫీసుకు రెండు మూడు కంప్లెయింట్స్ వస్తుంటాయి....ఫలానా స్టేజిదగ్గర ఫలానా నెంబర్‌గల ప్యాసింజర్ బస్సును కండక్టర్ ఆపలేదని.... ఫలానా స్టేజిదగ్గర ఫలానా నెంబర్‌గల ఎక్స్‌ప్రెస్ బస్సును కండక్టర్ అనవసరంగా ఆపి చాలా దిలే చేశాడని....ఫలానా కండక్టర్ ఫలానా

రోజు ఫలానా బస్సులో ప్యాసింజర్స్‌తో చాలారూడ్‌గా మాట్లాడా
దని.... ఇలాంటి ఫిర్యాదులే వస్తుంటాయి.... వాటిల్లో చాలావరకు
సూపర్‌ఫిషియల్‌గా వుండనే ఉంటాయి.... సీరియస్‌గా తీసుకోవా
ల్సినవి చాలా తక్కువగా వుంటాయి....కాని వచ్చినవి వచ్చినట్లు
ఓ ఫైల్లో రికార్డుచేసి పెట్టాలి.... ఇదిగో.... యిలా...." అంటు
ఇదివరకు రికార్డు చెయ్యబడిన ఫైలు చూపించాను.

నేను చెప్తున్నంతసేపు ఆమె సీరియస్‌గానే వింటున్నదని
గ్రహించాను.

"చాలా థ్యాంక్సండి.... ఆ ఫైలివ్వండి.... నేను చేసేస్తాను."

ఫైలు ఆమెకిచ్చి నా సీట్లో కూర్చున్నాను,

ఆమె శ్రద్ధగా పనిచెయ్యటం మొదలెట్టింది.... అందరూ
వాళ్ళ వాళ్ళ పనుల్లో మునిగిపోయారు—

లంచ్ టైంలో మిత్రబృందమంతా కలిశాము

ఆ రోజు టాపిక్ అమ్మాయిల మీదికే మళ్ళింది.

"యేంమధూ.... నీ సెక్షన్‌లో జాయినయిన ఆ లీల లీలల్ని
గూర్చి కాస్త చెబుదూ...." అన్నాడు రాజశేఖరం

"చూడటానికలా వుందిగాని వట్టిబెదురుగొడ్డు.... ఊరికెనే
భయపడిపోతుంది....వట్టి మట్టిబుర్రలా వుంది.... యేంచెప్పినా
గంగిరెద్దులా తలూపుతుంది. కాని తీరా చెప్పింది చెయ్యమంటే
కళ్ళు తేలేస్తుంది. కూడికలు తీసివేతలు కూడా సరిగ్గా వచ్చినట్టు
లేదు.... యిలాంటివాళ్ళకు ఉద్యోగంయిచ్చాడంటే మన ఆఫీసర్
ఎలాంటివాడో ఊహించుకోవచ్చు...." అన్నాడు మధు

"వరే మధూ.... మన ఆఫీసర్ వాళ్ళ కుద్యోగాలిచ్చింది
వాళ్ళకూడికల్ని తీసివేతల్ని చూసికాదు.... ఆ రెంటిని చూసి...."
అన్నాడు రాజశేఖరం అక్కడే గోడమీదున్న ఓ సినిమాస్టార్
కాలెండర్ చూపించి....

"యే రెంటిని; కాస్త తెలిసేట్టు చెప్పు గురూ...." అన్నాడు
మురళీధర్‌రావు.

"ఇంత స్పష్టంగా చెప్పినా తెలియకపోతే నీ ఖర్మ; అన్నట్టు
నీ సెక్షన్ కొచ్చిన పిట్టేమంటోంది విక్రమ్? వసపిట్టలా ఎప్పుడూ
వాగుతున్నట్టుగా వుందే?"— అన్నాడు.

"ఛ.... వనపిక్షేమిత్రా.... షి ఈజ్ ఎ వెరీ ఇంటెలిజెంట్ గర్ల్...." అన్నాను.

"అబ్బో.... అప్పుడే దాన్నంతగా పొగిడేస్తున్నావు. ఏమిటి విశేషం?"

"విశేషంలేదూ.... పాడులేదూ.... షి ఈజె వెరీ ఫాస్ట్‌లేడీ. ఏంచెప్పినా చలా త్వరగా అర్థం చేసుకుంటుంది."

"అర్థం చేసుకోవటానికి కంప్లెయింట్ సెక్షన్‌లో ఏముంటుంది నా బొంద.... నా సెక్షన్‌కు రమ్మను. ఆమె ఇంటెలిజెన్సెంతో చూపిస్తాను...." అన్నాడు సూర్యారావు చాలా కోపంగా

నే నేమీ మాట్లాడలేదు.

"మురళీధర్.... మీ ఆవిడేమంటోంది?" అన్నాడు రాజశేఖరం.

"మా ఆవిడేమిటి.... నాన్‌సెన్స్.... నీ జోక్ నాకేమీ నచ్చలేదు." అన్నాడు మురళీధర్ సీరియస్‌గా....

"ఊరికెనే అన్నానులేవయ్యా....! ఎందుకంత కోపగించుకుంటావు.... మీ సెక్షన్లో ఓ అమ్మాయి జాయినయ్యిందని మీ ఆవిడకు తెలుస్తుందని భయపడిపోతున్నట్టున్నావు."

అంతా గొల్లున నవ్వారు. మురళీధర్‌రావు భార్య మురళీధర్‌రావుకు వేరే ఎవరైనా ఆడవాళ్ళతో పరిచయమైందని తెలిస్తే తెగ గోల పెట్టేస్తుందని రాజశేఖరం ఎలా తెలుసుకున్నాడో తెలుసుకున్నాడు.

అందరూ నవ్వటంతో మురళీధర్‌రావు చాలా సిగ్గుపడిపోయాడు.

"పాపాలభైరవుడిలా నవ్వాకడివిచేరి ఈ ఆఫీసులో వర్క్ చేస్తున్నవాళ్ళ పరువు అంతా బజార్లో పడేస్తున్నావు...." అన్నాడు మురళీధర్‌రావు.

"అది సరేలేగాని మీ అమ్మాయినిగూర్చి కాస్త చెబుదూ."

"చెప్పటానికేమీ లేదు. ఆ అమ్మాయి చాలా మంచిభావంగా వుంటోంది. తన పనేమిటో చెప్పగానే ఆ పనిలో మునిగిపోయింది."

"నువ్వామె అందాన్ని చూడటంలో మునిగిపోయివుంటావు. కరెక్ట్...." మళ్ళీ అంతా నవ్వారు.

"యేమైనా చాలా అదృష్టవంతుడివోయ్. మురళీ వెలుగుర్లో కల్లా కొత్త ఒడ్డూ పొడుగూ వున్న అమ్మాయి.... మనకళ్ళకు కొత్త పరిచయంచే అమ్మాయి నీ సెక్షన్లోకే వచ్చింది...."- అన్నాడు రాజశేఖరం.

"ఆ మిస్ట్రీంకన్యనుగూర్చి మన టైపిస్ట్ దామోదర్ చెప్పాలి. "మధు.

"అమ్మబాబోయ్...." మిస్టరీంకన్య కాదు.... కంపు పట్టుకుంటే వదలదు!" అన్నాడు దామోదర్.

"అంతకంటే ఇంకేంకావాలి? అదృష్టవంతుడివి...."అన్నాడు రాజశేఖరం

"నాబొంద అదృష్టంలే.... ఒక్కసారి ఆగకుండా ఉర్దూలో గబగబా వాగేస్తుంది.... నాకేమో ఉర్దూ సరిగ్గా వచ్చి చావదు.... వచ్చీరాని ఉర్దూలో మాట్లాడితే ఎక్కడ నవ్వుతుందో నని భయం...."

మళ్ళీ అందరూ నవ్వారు.

అందరమూ టిఫిన్లు ముగించి, కాఫీలు సేవించి ఓ గంట వ్నరసేపు హస్కొదంచి మళ్ళీ మా మా సీట్లకు చేరుకున్నాము.

* * * *

రాత్రి చాలాసేపు చైతన్యను గూర్చి ఆలోచించాను. చైతన్య అందంగా వుంటుందా చైతన్యను చూడగానే ఆ అమ్మాయి అందంగా వుంటుందనో. లేక వికారంగా వుంటుందనో వెంటనే చెప్పలేం.... కొందరు స్త్రీలవిషయంలో అందంగావుండటమో లేక వికారంగావుండటమో. కొట్టొచ్చినట్టు కన్పిస్తుంది. కాని కొందరి విషయంలో అలాగాదు. ఎటూ తేల్చుకోలేని పరిస్థితి ఏర్పడుతుంది. చైతన్య ఆకోవకు చెందిన స్త్రీ అనుకుంటాను.

చైతన్య చాలా సన్నగా వుంటుంది. ఎముకలు తప్ప ఈ అమ్మాయి శరీరంలో ఇంకేమీ లేదా అనిపిస్తుంది. అంత సన్నగా వుండటంవల్లనే చాలా చిన్నపిల్లలా కనిపిస్తుంది. ఫ్రాక్ వేసి హైస్కూలుకు పంపిస్తే హైస్కూల్లో చదివే అమ్మాయిలానే వుంటుంది చైతన్య వయస్సు ఎంతో చెప్పటం కొంచెం కష్టమే- ఇరవై పైనే అనుకుంటాను. అయినా టీన్స్‌లో వున్నట్టుగా కన్పిస్తుంది.

పేరుకు తగ్గట్టుగానె చైతన్య మూర్తీభవించిన చైతన్యంలా కనిపిస్తుంది. చైతన్యలోని చైతన్యమంతా ఆమె కళ్ళలో వుంది. అంత విశాలంగా లేకపోయినా ఆ కళ్ళు ఎప్పుడూ ఒక సజీవత్వాన్ని వెలారుస్తుంటాయి ఆమెలోని ఆకర్షణకు కారణం ఆకళ్ళే ననుకుంటాను

ఒకేసారి నల్గురమ్మాయిలు మా ఆఫీసులో జాయినయినా నేను ఒక్క చైతన్యనుగూర్చే ఇంతగా ఆలోచించటానికి కారణం? నిజానికి ఆ నల్గుర్లో ఉమ చాలా అందంగా వుంటుంది. లేతగులాబీ లాంటి మార్దవంతో ఎప్పుడూ నిగనిగలాడుతూవుండే ఉమను చూడగానే కాస్సేపు మన కన్నుల్ని ఆమెమీదనుంచి మళ్ళించుకో లేకపోతాము. కాని ఉమనుగూర్చి నే నేమీ ఆలోచించటంలేదు. ఉమలో లేని ప్రత్యేకతేదో చైతన్యలో వుండటమేనా కారణం? కాదు.... చైతన్య మా సెక్షన్‌లో జాయినయ్యింది. ఆమె నేదో అని ఉడికించాలని ప్రయత్నించిన నన్ను ఆమే అని ఉడికించింది. మళ్ళీ నన్ను ఆమె నేదన్నా అనే ఛాన్సివ్వలేదు. అయినా ఆమెదగ్గర కెళ్ళి ఆమెకు ఆమె చెయ్యాల్సిన పని ఎలా చెయ్యాలో చూపించాను. నా శ్రమకు తగిన ప్రతిఫలం యిస్తానంది. నా శ్రమకు తగిన ప్రతిఫలమేమిటో చెప్తానంది. చెప్పింది యిస్తుందా? నాలో నేను నవ్వుకున్నాను. అప్పుడే అవమానించి, అప్పుడే అంత చనువుగా మాట్లాడిన ఆ అమ్మాయి యెలా అర్థంచేసుకోవాలో తెల్సుకో లేకపోయాను. ఆడవాళ్ళు చాలా విచిత్రంగా ప్రవర్తిస్తారంటారు. ఇందుకేనేమో

చైతన్య మా సెక్షన్‌లో జాయిన్‌కావటం. నాతో మాటలు పెంచుకోవటం.... అప్పుడే ఆమెమీద నాకేదో అధికారం యేర్పడి నట్టుగా ఫీలవుతున్నాను. నా వాకచాతుర్యమంతా ఉపయోగించి ఆమెను ఉడికించాలని, ఏడిపించాలని, మాటా మాటా పెంచుకోవాలని.... నాలో ఏవేవో ఆలోచనలు, ఐడియాలు....ప్లాన్స్....

* * * *

తెల్లారి ఆఫీసుకు వెళ్ళేముందు నా డ్రెస్ అలంకరణల విష యంలో ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకున్నాను. రూపంలోనూ, మాట ల్లోనూ, చేతల్లోనూ చాలా డాషింగా కన్పించాలని నా ప్రయత్నం,

జీవితంలోని ప్రతిక్షణాన్ని థ్రిల్లింగ్‌గా, డాషింగ్‌గా, డాజ్లింగ్‌గా గడపాలని నా ప్రయత్నం. 'దేర్ మస్ట్ నెవర్ బి యే డల్ మూమెంట్ ఇన్ యువర్ లైఫ్!'-

సరిగ్గా 9-30 కి ఆఫీసులో అడుగుపెట్టాను.

విన్న జాయినయిన నల్గురు ఆడపిల్లలు అప్పటికే వచ్చేసి వాళ్ళ వాళ్ళ సీట్లలో కూర్చున్నారు. వాళ్ళ తలల్లోని మల్లెపూల మత్తు వాసనలతో ఆఫీసంతా గుబాళిస్తోంది. వాళ్ళను చూడగానే కాలేజీలో చదువుకున్న రోజులు జ్ఞాపకం వచ్చాయి. "హాయ్! హాయ్!" అంటూ ఈల వెయ్యాలని అనిపించింది

"హల్లో మిస్టర్ విక్రమ్!" అంది చైతన్య నన్ను చూడగానే హుషారుగా.

"హల్లో మేడమ్! అప్పుడే వచ్చేశారా?"

"మేడమ్ యేమిటి మేడమ్మలాగా.... నా పేరు మీకు తెలుసుగా? హాయిగా నా పేరు పెట్టి పలకరించొచ్చుగా?"

అనుకోకుండా ఎదురైన ఈ ప్రతిఘాతంతో షాకై పోయాను.

"అఫ్‌కోర్స్.... మేడమ్ అని పిలిస్తే మీకేమైనా అబ్జెక్షనా?"

"అబ్జెక్షనా అని మెల్లగా అంటున్నారా? మేడమ్ అని ముసలాళ్ళని పిలుస్తారు...."-

"ఓ! అలాగా? అయామ్ రియల్లీ సారీ....సోవీ....మిస్' అని పిలవమంటారా?"-

"మిస్సూ లేదు గిస్సూ లేదు.... చక్కగా 'చైతన్యా' అని పిలవండి చాలు.... !"-

"మీకు మీ పేరంటే చాలా ఇష్టంలా వుందే."-

"అవును.... ఏం? మీకేమన్నా అబ్జెక్షనా?"-

"నో నో నో.... నాకెందుకాబ్జెక్షన్?"-

వెళ్ళి నా సీట్లో కూర్చున్నా.... ఈమెతో మాట్లాడటమంటే మామూలు విషయం కాదనిపించింది

ఒక్కొక్కరే వచ్చి వాళ్ళవాళ్ళ సీట్లలో కూర్చుంటున్నారు. చైతన్య అందర్నీ పనిగట్టుకుని పలకరిస్తోంది

"హల్లో దామోదర్‌గారు.... గుడ్ మార్నింగ్.... హల్లో

రాజశేఖరంగారూ.... గుడ్ మార్నింగ్.... హల్లో మాధవరావు గారు....గుడ్ మార్నింగ్...." -

ఈమె కప్పుడే ఇంతమంది పేర్లెలా తెలిశాయి? మిగతా ముగ్గురమ్మాయిలు తలలు వంచుకుని వాళ్ళ పనుల్లో నిమగ్నమై పోయారు.

ఇవాళ ఆఫీసుకొచ్చిన అందరిలోనూ ఏదో మార్పు గమనించాను. అందరూ కాస్త మంచిబట్టలు వేసుకున్నారు. ఎప్పుడూ మాసినగడ్డంతో కన్పించే మా సూపరింటెండెంట్ మాధవరావు చాలా నున్నగా గడ్డంచేసుకుని రావటం ఎప్పుడూ చాలా కేర్ లెస్‌గా డ్రెస్‌చేసుకునే రాజశేఖరం ఇవాళ శుభ్రంగా ఇన్‌షర్టు చేసుకుని రావటం నా కాశ్చర్యాన్ని కల్గించలేదు.

"అబ్బ! ఎంతకాలానికి ఈ ఆఫీసులో ఇంతలైఫ్ చూస్తున్నాను!" అన్నాను.

"అంటే....? ఇంతకాలం ఈ ఆఫీసు యే చంద్రమండలం లాగానో నిర్జీవంగా వుండేదనా మీ ఉద్దేశ్యం?...." టకీమని అనేసింది చైతన్య.

"ఆల్ మోస్ట్.... అలాగే వుండేది...." నేనూ మొండికేశాను. "ఆక్సిజన్.... నీళ్లూ, నిప్పులూ — ఇవికూడా వుండేవి కాదన్నమాట!"

"ఔను!"

"ఒక్కసారి యింత సృష్టి ఎలా జరిగిందీ.... తెల్లవారేసరికి ఇక్కడో బిల్డింగ్, ఇంతమంది మనుషులు, ఇంత లైఫ్.... ఎలా వచ్చాయంటారూ....?"

"ఇంత సింపుల్ థింగ్ మీకు తెలియకపోవటం.... చాలా ఆశ్చర్యంగా వుందే?"

"నాకు తెలుసు; కానీ.... తెలిసింది మీకు తెలుసో తెలియదో తెలుసుకుందామని...."

"అబ్బో! ఏమో అనుకున్నాను....నువ్వు అవులిస్తే పేగులు లెక్కపెడ్తావే?" అన్నాడు మా సంభాషణ వింటూన్న మాధవరావు.

"పొరపాటు సార్...." అంది చైతన్య.

"ఏమిటి పొరపాటు?" కంగారుపడ్డాడు మాధవరావు.

"అవులిస్తే పేగుల్లెక్కపెడ్తా వన్నారు మీరు.... కాని నాకు చదువుచెప్పిన మా మేష్టారొకాయన నా కింతకంటే పెద్ద కాంప్లి మెంటే యిచ్చారు."

"ఏమిటది?"—

"ఆయన ఏమనేవారంటే.... "అమ్మాయీ! నువ్వు అవు లించకుండానే పేగులు లెక్కపెడ్తావు...." అని .... ఒకసారి ఏమయిందంటే.... అంటూ ఏదో చిన్న కథలాంటిని చెప్ప బోయింది చైతన్య.

"యేమండీ.... మీరింకా ఇలా ఎంతసేపు మాట్లాడబోతున్నారు?"

ఇంకో ఐదునిమిషాలు.... ఏమీ అబ్జెక్షన్?"—

"అహఁ.... ఏమీలేదు.... బయటికెళ్ళి కొండు ఆస్ప్రో బిళ్ళలు తెచ్చుకుందామని...." అన్నాను— కసిగా, చాలా గట్టిదెబ్బే కొడ్తున్నానన్న కాన్ఫిడెన్స్‌తో—

చైతన్య నామాట వినగానే గలగలా విరగబడి నవ్వింది. ఆడవాళ్ళు అంత పెద్దగా నవ్వటం నే నెప్పుడూ చూళ్ళేదు.

"నాలాగే మీకూ ఎప్పుడూ ఆస్ప్రో అవసరంపడ్తుందన్న మాట! నాదగ్గరున్నాయి.... కావాలా?"— అంటూ ఆమె తన వానిటీ బాగ్ తెరచి రెండు ఆస్ప్రో బిళ్ళలు నావేపు విసిరేసింది.

"మీరు ఒకేసారి చాలాఉద్యోగాలు చేస్తున్నట్టున్నారే! ఆస్ప్రోకంపెనీవాడు మీకు నెల కెంతిస్తాడేమిటి?"— అన్నాను ఈ దెబ్బైనా తగలకపోతుందా అన్న నమ్మకంతో—

"చూశారా సూపరింటెండెంట్‌గారూ....! ఆస్ప్రో కావా లన్నారు.... తోటిమానవుడు తలనొప్పితో బాధపడ్తున్నాడుకదా అన్న మానవత్వంతో నేనాయనకు ఆస్ప్రోబిళ్ళ లిస్తే ఆ కంపెనీ వాళ్ళు నీ కేమిస్తారని అడుగుతున్నాడాయన.... ఇదేమన్నా బాగుందా చెప్పండీ?"— అంది చైతన్య చాలా సీరియస్‌గా ఫిర్యాదుచేస్తున్నట్టు నటిస్తూ—

"మీరిద్దరూ కాస్సేపు నోరుమూసుకుంటే నాకు చాలా బాగుంటుంది.... నిన్న ఈపాటికి జాయిన్ కాలేదు.... అప్పుడే ఈ ఆఫీసంతా నీదే అయినట్టు ఒక్కక్షణం వూరుకోకుండా తెగమాట్లాడు తున్నావు! ఏమిటిది?"— అన్నాడు మాధవరావు.

"ఏంచెయ్యను చెప్పండి? నేను పుట్టినప్పుడు మాయాయమ్మ గారు నా కొంచెం పస ఎక్కువపోసింది...."- అంటూ చైతన్య తాప్పేపు మాట్లాడటం ఆపేసింది.

ఆమె మాట్లాడుతుంటేనే బావుంటుం దనిపించింది నాకు.

ఎంత స్మార్ట్‌గా వుంటున్నా ఆమెతో మాటలతో గెలవలేక పోతున్నాను.

ఆమెతో మాటల్లో గెలవాలని నాలో ఏదో వెర్రిపట్టుదల.... కనీసం ఒక్కసారైనా ఆమెతో మాటల్లో గెలవగల్గితే?"-

ఉన్నట్టుండి చైతన్య ఫక్కున నవ్వింది. పనిచేసుకుంటున్నవాళ్ళంతా ఆమె కేసి యేమిటన్నట్టుగా చూశారు.

"ఈ కంప్లైయింట్ చూశారా?" - అంది చైతన్య ఓ కాగితాన్ని పట్టుకుని మాధవరావుగార్కి చూపిస్తూ.

"ఏమిటది?" - అన్నాడు మాధవరావు విసుగ్గా.

"....మొన్న అనగా 21-8-76 నాడు నేను మీ ఆర్. టి. సి. బస్సులో నెం. APZ 2083 లో (పర్కాలనుండి హనుమకొండ మధ్య నడుచు బస్సు) కొత్తపల్లిలో యెక్కి కొత్తగూడెంలో దిగితిని. ఆ బస్సుకండక్టర్ నాదగ్గర టిక్కెట్టునిమిత్తం 40 పైసలు తీసుకునెను కాని టిక్కెట్టు ఎంతఅడిగినా యివ్వకుండెను. ఇంటికెళ్ళాక మా ఆవిడకు నేనుచేసిన ఖర్చుకు సంబంధించిన లెక్క అప్పచెప్పు సమయంలో 40 పైసల టిక్కెట్టు చూపించనందున నేనా 40 పైసలను ఖర్చుపెట్టి కల్లుతాగినానని నమ్మి రెండు రోజులుగా నాకు అన్నం పెట్టకుండా మాడ్చి చంపుచుండెను. కావున నాయందు దయదలచి సదరు 40 పైసల టిక్కెట్టును ఈక్రింది 'పత్తా'కు పార్సల్ చెయ్యగలరని కోరనైనది - రెండు రోజుల్లోగా మీరు అట్టి టిక్కెట్టును పంపించలేకపోయినచో నన్ను మా ఆవిడ పైలోకానికి పంపించటం ఖాయం. ఇట్లు-మన్నెబోయిన చంద్రయ్య-కొత్తగూడెం - తాలూకా- పర్కాల- జిల్లా-వరంగల్ ...."-

చైతన్య చదవటం పూర్తిచెయ్యగానే అందరూ గొల్లున నవ్వారు.

"సూపర్నెంట్‌గారూ.... పాపం.... అయన కా 40 పైసల టిక్కెట్టు పంపించే యేర్పాటు చేస్తారా?" -

... ఆ కాయితాన్ని చెత్త బుట్టలో పడెయ్...."

"వీళ్ళు ఆడవాళ్ళా బాబూ.... రాక్షసులు....!" అన్నానేన్నేను.

"ఎవరండీ రాక్షసులు? మీ కళ్ళకు మేం రాక్షసుల్లా కనిపిస్తున్నామా? అంత రాక్షసత్వం మాలో యేం కన్పించిందండీ....ఊరికే వాగుతున్నాననేగా మీకువన్ను అంతమాటన్నారు? అంటే నన్నొక్కదాన్ని అనండి....పాపం....మిగతా ముగ్గురూ ఏమన్నారు? నోరు మెదపకుండా పని చేసుకుంటున్నారుగా...." అంది చైతన్య కోపంగా

"అబ్బబ్బబ్బ... రాక్షసులు అంది మిమ్మల్ని కాదు తల్లీ.... ఆ లెటర్లో 40పైసల టికెట్లు చూపించనందుకు ఆ మొగుణ్ణి తిండీతిప్పల్లేకుండా మార్చేస్తోందే .... ఆ మహాతల్లి నుద్దేశించి. 'ఆడవాళ్ళు కార్రా బాబూ రాక్షసులు' అన్నాను"

చైతన్య మళ్ళీ ఫక్కున నవ్వింది

"సారీ విక్రమ్‌గారూ.... మమ్మల్నే అన్నారేమోనని.... అది సరేగాని.... నేను మీకళ్ళకు తల్లి లాగ కనబడుతున్నానా?"

"సారీ....గభాల్న వచ్చేసింది....లేకపోతే మిమ్మల్ని అంత మాటని బ్రతగ్గలనా."

"ఏమిటండీ మీరు? సారీ దారుణంగా మాట్లాడుతున్నారు.... మీరు ఒకవేళ అంతమాట అన్నారనుకోండి.... అంతమాత్రాన మిమ్మల్ని బతకనివ్వకుండా చంపేస్తానా? మీరు చాలా తెలివైన వారు సార్...." అంది చైతన్య నిష్ఠూరంగా.

"ఎందుకు?"

"రాక్షసి అని అనకుండానే అనేశారు...."

"ఏమిటండీ యిది? మళ్ళీ అదేమాట? మిమ్మల్నిప్పుడు నేను రాక్షసి అన్నానా? వాటీజ్ దిస్?"

"మిమ్మల్ని అంతమాటని బతగ్గలనా అన్నారు? అంటే దానర్థం ఏమిటి? అంతమాటంటే నేను మిమ్మల్ని చంపేస్తాననేగా? తోటిమానవుణ్ని చంపేసేవాళ్ళని ఏమంటాను? రాక్షసులనేగా?"

"మీ లాజిక్‌తో నా బుర్రపేడెక్కిపోతోంది.... కాసిని

మంచినీళ్ళు తాగొస్తాను...." అంటూ నా సీట్లోంచి లేవబోయాను.

"ఉండండుండండి.... కూజా నా పక్కనే వుంది.... మంచి నీళ్లు నేను తెచ్చిస్తా నుండండి...."

చైతన్య లేచి గ్లాసువిండా చల్లని నీళ్ళు తెచ్చి నా కిచ్చింది. ఆమె నన్ను అంతగా ఉడికించినా ఆమెచేతి మంచినీళ్ళు తాగటం నాకు హాయిగానే వుంది.

"నాకు ఇలా నా ఫ్రెండ్స్‌కి మంచినీళ్ళు తాగించటమంటే చాలా ఇష్టమండీ...." అంది చైతన్య చిలిపిగా నవ్వుతూ.

"ఎలాగైతేనేం.... నన్నుకూడా మీ ఫ్రెండ్స్ లిస్టులోకి ఎక్కించేశా రన్నమాట ! థ్యాంక్స్."

"ఎప్పుడో ఎక్కించేశాను. నిన్న మిమ్మల్ని చూడగానే మిమ్మల్ని నా ఫ్రెండ్స్ లిస్టులో కెక్కించేశాను."

"ఏమిటి ? నేను మీకళ్ళకు అంత అమాయకంగా కన్పించానా ?"

"సులభంగా మంచినీళ్ళు తాగించటానికిక్కడొకడున్నాడని"

చైతన్య మళ్ళీ హాయిగా నవ్వింది.

"ఎప్పుడూ మీరే మంచినీళ్ళు తాగిస్తా రనుకోకండి. ఎంత అమాయకుడైనా నేనుకూడా మీకు మంచినీళ్ళు తాగించే రోజు వస్తుంది."

"తప్పకుండావస్తుంది. మంచినీళ్ళు "తాగించటమే" కాదండీ. "తాగటం"కూడా నా కిష్టమే.... అందులో మీ చేత తాగటం మరీ యిష్టం....."

"ఎందుకు ?"

"ప్రతిదానికీ చంటిపిల్లాడిలా 'ఎందుకూ' అని అడక్కూడదు.... అదంతే!"—

"ఈజిట్ ?" - అన్నాను ఆశ్చర్యంగా. నన్నామె చంటి పిల్లాడనటం ఎందుకో నా గుండెలకి చక్కిలిగింత పెట్టినట్టుగా ఫీలయ్యాను.

—లంచ్ టైమ్‌లో చైతన్య నా సీటుదగ్గరకొచ్చి "టీ తాగుదాం.... వస్తారా ?" - అంది.

"మంచినీళ్ళేకాదు. మీరు టీకూడా తాగిస్తా రన్నమాట! ఎక్కడకెడదామంటారు ?"—

ఎక్కడికమిటి? క్యాంటీనకు?"—

"క్యాంటీన్‌కా....? మీ యింటికి రమ్మంటారేమోనని ఆశించాను...."—

"మీరు గొప్ప ఆశాజీవుల్లా వున్నారే.... మా ఇంటిక్కూడా పిలుస్తాను.... ప్రస్తుతానికి క్యాంటీన్ కెళదాం పదండి...."—

నేను లేచి ఆమె వెంట వెళ్ళాను.

* * * *

క్యాంటీన్ కెళ్ళి చైతన్యపక్కనే కూర్చుని టీ తాగటం చాలా హాయిగా వుంది. అందరూ మమ్మల్నే చూస్తున్నారు. చైతన్య ఒక్కక్షణం వూరుకోకుండా ఏదోమాట్లాడుతూనే వుంది నాపక్కనే కూర్చుని, నామీదకువిరుగుతూ ఫ్రీగా, యేసంకోచం లేకుండా మాట్లాడేస్తూంటే నాకు కొంచెం భయంగా, ఎంతో థ్రిల్లింగా, ఎంతో కొత్తగా వుంది.

"ఏమండీ.... విక్రమ్‌గారూ! మీ మగవాళ్ళకేమైనా బుద్ధుందా?"—

"ఎందుకు?"—

"ఎందుకేమిటి? నేను మీతో ఇలా దగ్గరగా కూర్చుని టీ తాగటాన్ని మీవాళ్ళంతా చూడండి.... ఎలా మొహాలు వేళ్ళాడేసుకుని.... పల్లెటూరిజనంలా చూస్తున్నారో...."—

"అది వాళ్ళ తప్పుకాదు...."

"అయితే.... నాతప్పా? ఇలా మీపక్కన కూర్చుని టీ తాగటం నా తప్పే అంటారేమో...."

"ఊహూఁ.... అనను.... కాని మావాళ్ళు అలా మనకేసి మొహాలు వేళ్ళాడేసుకుని చూడటానికి కారణం మీ ఆడవాళ్ళే నంటాను!"—

"ఎందుకు?"—

"మీలాగా ఇలా ఫ్రీగా తమ కొలీగ్స్‌తో మాట్లాడే ఆడ వాళ్ళు ఎందరుంటారు చెప్పండి.... మగవాళ్ళు మనకేసి చూస్తేనే మైలపడిపోతాం అన్నట్టు ప్రవర్తిస్తారు మీ ఆడవాళ్ళు.... తమ వాళ్ళలాగా పరదాలు వేసుకోరుకానీ.... పరదాలో వున్న స్త్రీల కంటే అధ్వాన్నంగా ప్రవర్తిస్తారు. ఒకరకంగా ఆలోచిస్తే ఆ పరదా వేసుకున్నవాళ్ళే నయమనిపిస్తారు.... మీ ఓగతా మగ్గు

ఆడపిల్లల్ని చూడండి.... మీలాగా అందరితో ఫ్రీగా మాట్లాడుతున్నారా? మీలాగ ఇలా అందరితో కూర్చుని టీ తాగుతున్నారా? మగవాళ్ళ మధ్య కూర్చుని కాలేజీలో చదువుకోవచ్చు.... ఉద్యోగాలు చెయ్యొచ్చు.... కాని వాళ్ళతో మాట్లాడగూడదు ప్రతిచోట స్పెషల్ ట్రీట్‌మెంటు కావాలి.... హోటళ్ళలో సెపరేట్ రూమ్స్.... సినిమాల్లో సెపరేట్ సీట్స్.... బస్సుల్లో రిజర్వ్‌డ్ సీట్స్.... కనీసం మీరు పనిచేసే ఆఫీసు క్యాంటీన్లోకూడా తన కొలీగ్సుని కలవగూడదు ... అక్కడ ఓ పరదా అడ్డం పెట్టుకుని కూర్చోవాలి — మీ ఆడవాళ్ళు ఈ ట్వంటీయత్ సెంచరీలో జీవించటంలేదు....మధ్యయుగాల్లో జీవిస్తున్నారు...."—

— చైతన్యను ఉడికించాలని చాలా ఘాటుగానే అన్నాను.

చైతన్యకి నేను ఊహించినదానికంటే ఎక్కువ కోపమే వచ్చేసింది.

"మీ ఆడవాళ్ళు ఈ ట్వంటీయత్ సెంచరీలో జీవించటంలేదు....ఎక్కడో మధ్యయుగాల్లో జీవిస్తున్నారు...." వెక్కిరిస్తున్నట్టుగా అంది చైతన్య.

"గాడిదగుడ్డు జీవిస్తున్నారు....అసలు ఈ దేశంలో ఆడవాళ్ళెప్పుడన్నా జీవించారా? మీరు వాళ్ళని జీవించనిచ్చారా? వాళ్ళని మీ కాళ్ళకింద నలిపివెయ్యలేదూ.... వాళ్ళ నెప్పుడైనా ఎదగనిచ్చారా? ఇల్లనే జైల్లో పెట్టి వాళ్ళను బానిసలకన్నా హీనంగా చూశ్లేదూ....ఆడవాళ్ళని అణచివెయ్యడానికి ఈ దేశంలో ఎన్ని శాసనాలు...ఎన్ని మనుస్మృతులు.... ఎన్ని సాంప్రదాయాలు.... ఎన్నిసామెతలు.... ఎన్ని కావ్యాలు, ఎన్ని పురాణాలు.... ఎన్ని నీతులు.... ఎన్ని వ్యాఖ్యానాలు.... మధ్యయుగాల్లో జీవించక యేం చేస్తాం? వాళ్ళ నెప్పుడైనా మీతోపాటు ఈ ట్వంటీయత్ సెంచరీలోకి తీసుకొచ్చే ప్రయత్నం చేశారా? అసలు స్త్రీ నెప్పుడైనా ఓ మనిషిలా చూశారా? స్త్రీకూడా మనస్సుంటుంది....సెంటిమెంట్స్ వుంటాయి. వీక్‌నెసెస్ వుంటాయని అంగీకరిస్తారా? స్త్రీ ఏంచేసినా మీకు చిత్రంగానే కన్పిస్తుంది.... వెంటనే కామెంట్స్.... వ్యాఖ్యానాలు.... సిద్ధాంతాలు.... సామెతలు.... కథలు.... ప్రపంచంలో మోస్ట్ సప్రెస్డ్ క్లాస్ ఎవరూ అంటే స్త్రీ లంటాను...."

"ఏ న్నడిగితే, అవి అపటం మర్చిపోయినట్టున్నారు...."

"న న్నడిగినా, అడక్కపోయినా ఇదేమాట అంటాను.... నాకేమీ భయంలేదు...."

"యేమండీ....కాసిని మంచినీళ్ళు తాగుతారా?"

"అక్కర్లేదు....టీ తాగుతాను...."

"మీకు మంచినీళ్ళు తాగించే భాగ్యం పోగొట్టారు?"

"అంత సులభంగా తాగుతా ననుకున్నారా?"

"మీ కోపం చల్లారేటప్పటికి టీ కూడా చప్పగా చల్లారిపోయి మంచినీళ్ళలాగే తయారయ్యింది....మరో టీకి ఆర్డరిమ్మంటారా?"

"మీకేం ఎన్ని టీలైనా ఆర్డరిస్తారు.... బిల్ పేచేసేదాన్ని నేను.... నాకు చల్లారిన టీ అంటేనే యిష్టం...."

చైతన్య టీ సిప్ చేయటం మొదలెట్టింది. నేను సిగరెట్ వెలిగించుకుంటూ "ఎనీ అబ్జెక్షన్?" అన్నాను

"నో అబ్జెక్షన్...."

"మీకు చల్లారిన టీ అంటే యిష్టమంటే నమ్మలేక పోతున్నాను...."-

"ఎందుకూ?"

"ఎప్పుడూ వేడివేడిగా వుండే మీరు...."-

"ఎప్పుడూ వేడిగా వుంటానా? ఛ! నా టెంపరేచర్ నార్మల్ కంటె కొంచెం తక్కువగానేవుంటుందంటారు మా డాక్టర్. కావాలంటే చూడండి...."- చైతన్య తన చేతిని నా చేతికి అనించింది. ఆమె స్పర్శ నాలోకి విద్యుత్తుని పంపించింది

"నాకు చల్లటి టీ అంటే ఎందుకిష్టమో చెప్పమంటారా?"-

"చెప్పండి...."-

"వేడి టీ అయితే అది మనల్ని కంట్రోల్ చేస్తుంది.... చల్లటి టీ - దాన్ని మనం కంట్రోల్ చెయ్యొచ్చు.... మనంచెప్పి నట్టు వింటుంది...."- అంటూ గొల్లున నవ్వింది చైతన్య. నేను కూడా నవ్వాను,

"ప్రతిదాన్నీ మీరే కంట్రోల్ చెయ్యాలని ప్రయత్నిస్తారన్న మాట...."-

"అలా అనేకంటే నన్ను వేరేవాళ్ళు కంట్రోల్ చెయ్యటం

నా కిష్టం వుండదు అంటే వాస్తవానికి దగ్గరగా వుంటుంది....

"అలాగా! మీరు కథలు, నవలలు, కవితలు తెగ చదివేస్తారేమిటి?"

"చదవటమే కాదు.... రాసేస్తుంటాను కూడా...." -

"అలాగా.... అయితే మీరు రచయిత్రి అన్నమాట.... మీ రచనలు...." -

"ఏ యే పత్రికల్లో వచ్చాయి.... తెలుగుపత్రికల కింకా అంత అదృష్టం పట్టలేదులెండి.... అలా అనేకంటే తెలుగుపత్రికల్లో వచ్చేంత చవకబారు రచనల స్థాయికి నా రచనలింకా దిగజారిపోలేదు అనటం వాస్తవానికి దగ్గరగా వుంటుందనుకుంటాను...."-

త్వరలో అది జరుగుతుందంటారా?"-

"ఏది?" -

"దిగజారిపోవటం.... తెలుగుపత్రికల్లో వచ్చే రచనల స్థాయికి మీ రచనలుకూడా...." -

"అది ఈ జన్మలో జరగదు.... నా రచనలు పబ్లిష్ కావాలంటే నేనే ఓపత్రిక పెట్టాలి...." -

"దాన్ని మీరే చదువుకోవాలేమో!"-

"మీలాంటి చాలామంది చదువుతారు...."-

"తెలుగుపాఠకులు అంతగా దిగజారిపోయా రంటారా?

"పొరపాటు! మీకు మీ అభిప్రాయాన్నెలా వ్యక్తం చెయ్యాలో తెలీలేదు...."

"ఎందుకు?"-

"తెలుగుపాఠకులు అంతగా ఎదిగారంటారా? అని అడగదల్చుకున్నారు మీరు...."

"నేను అలా అడగదల్చుకున్నానని మీ కెలాతెలుసు?"

"మన సంభాషణ సీక్వెన్స్‌ను ఫాలో అవుతే.... మీరు అలాగే అడగాలి! సీక్వెన్స్ మర్చిపోయి పప్పులో కాలేశారు.... టైమయింది. అంతావెళ్ళిపోయారు. క్యాంటీన్‌లో మనమే మిగిలాం. లేవండి...."

"బిల్లు నేను చెల్లిస్తాను...."

"గాడిదగుడ్డు.... నేనే చెల్లిస్తాను...."

ఏమీ తీసుకుంటాడా!"

"ఎందుకు తీసుకోడు!"

"గాడిదగుడ్డు నా దేహంచేసుకుంటాడండీ....!"

చైతన్య ఆ క్యాంటీన్ కప్పు ఎగిరిపోయేలా గొల్లున నవ్వింది.

"గుడ్ జోక్!"

"థాంక్యూ!"

కౌంటర్‌దగ్గరకు నేనే మొదట వెళ్ళి టేబుల్‌మీద చిల్లర పడేశాను.

ఆ చిల్లరంతా తీసి నా జేబులో వేసి తన వానిటీ బ్యాగ్ లోంచి ఒక రూపాయి తీసి హోటల్‌వాడి కిచ్చింది చైతన్య.

"టీకి రమ్మని పిల్చింది నేను కాబట్టి బిల్ నేనే ఇస్తాను. దట్స్ మై ప్రిన్సిపల్.... ఇక్కడకూడా మీ పురుషాధిక్యత చూపించకండి."

"ఇందులో పురుషాధిక్యత యేముందో నా కర్థంకాలేదు."

"ఓ అమ్మాయి, అబ్బాయి హోటల్‌కెళ్తే అబ్బాయే తప్పకుండా సరిగా బిల్‌చెల్లించాలన్న సాంప్రదాయమొకటి ఏడ్చిందిగా మనకు! అలాంటి సాంప్రదాయం ఏర్పడటానికి కారణం స్త్రీ నేదో పాట్రనైజ్‌చేస్తున్నట్టుగా కన్పిస్తూపురుషాధిక్యతనుచాటటంకోసంకాదూ!"

"అయితే ఇప్పట్నుంచి మనం ఎప్పుడు క్యాంటీన్‌కెళ్ళినా మీరే బిల్లు చెల్లించండి.... ఐ హావ్ నో అబ్జెక్షన్."

"బట్.... ఐ హావెనాబ్జెక్షన్.... బిల్లు చెల్లించటం అన్నది రెసిప్రోకల్‌గా జరగాలి. ప్రతిసారీ నేనే చెల్లిస్తానని నే నన్లేదే! నేను ఇన్‌వైట్ చేశాను కాబట్టి నేను చెల్లిస్తానన్నాను. దట్సాల్!"

ఆఫీసులో కెళ్ళి మా సీట్లలో కూచున్నాము.

ఇంతసేపు చైతన్యతో జరిగినసంభాషణ నాచెవుల్లోగింగురు మంటోంది. చెత్త ఫైల్స్‌మీదకు నా దృష్టి వెళ్ళటంలేదు, చైతన్య క్యాంటీన్నుండిరాగానే ఫైల్స్‌లో మునిగిపోయింది. ఏదో రాస్తోంది. ఒకటి రెండు సార్లు మాధవరావుదగ్గరకెళ్ళి యేదో అడిగింది. అత దేదో చెప్పాడు. వళ్ళీవచ్చి తనసీట్లో కూర్చుంది.

నా బుర్రంతా వేడిగా వుంది చాలా సిగరెట్లు తగలేశాను.

రాసిందే రెండు మూడు సార్లు రాశాను. కొట్టేశాను. టీ తాగుదాం రమ్మని రాజశేఖరం వస్తే వాడితో వెళ్తే వాడో అరగంటసేపు బోర్ చేశాడు. చైతన్యనుగూర్చి అడిగాడు 'టీకి తను పిల్చిందా, నువ్వు పిల్చావా?' అని అడిగాడు. తనే పిల్చిందంటే నోరు తెరి చాడు. యేం మాట్లాడుకున్నారో చెప్పమంటాడు. ఏమీ లేదంటే నమ్మడు. రాజశేఖరంలాగే చాలామంది ఆరోజు నన్ను ఆ ప్రశ్న అడిగారు. అందరికీ జవాబులు చెప్పలేక చచ్చాను.

సరిగ్గా ఐదుగంటలకు చైతన్య తనసీట్లోంచిలేచి వెళ్ళటా నికి రెడీ అయ్యింది.

"యేమమ్మా అప్పుడే వెళ్ళిపోతున్నావా?"

"ఔనండీ.... టైమయిపోయిందిగా.... ఆఫీసు 9. 30 నుండి 4 వరకన్నారే? విత్ పవవర్ లంచ్ బ్రేక్...."

"అది నిజమేనమ్మా.... ఐదైనా మేమందరమూ ఆఫీసులో వుండటంలేదూ...."

"బయటి ప్రపంచంతో మీ కేమీ పనిలేదుకాబట్టి వుంటు న్నారేమో.... నాకు చాలా పనుంది.... వెళ్ళొస్తాను...."

"ఆఫీసర్ పిలుస్తాడు. నువ్వు డీల్‌చేస్తున్న ఫైల్ కావా లంటాడు.... నువ్వు వెళ్ళిపోయావంటే ఎందుకు వెళ్ళనిచ్చావని నామీద అరుస్తాడు.... వేరేవాళ్ళలాగా చచ్చినట్టు 4గం॥ల తర్వాత కూడా వుండటంలేదూ?"

"సూపర్నెంటుగారూ! వేరేవాళ్ళు చచ్చినట్టున్నారన్నారు.... చచ్చినట్టు వుండటం నాకు చేతకాదు.... బ్రతికున్నన్నాళ్ళూ బ్రతికినట్టుగా వుండటమే నా కలవాటు.... ఐదింటితర్వాత యే ఆఫీసర్ నన్ను పిలవడు.... ఒకవేళ పిలిస్తే, చెప్పండి.... రేపు నేనే వెళ్ళి ఆఫీసర్‌గారితో మాట్లాడ్తాను. నాలుగుతర్వాత ఒక్క క్షణంకూడా నేను ఆఫీసులో వుండను."

"అఁ.... అఁ.... ఇలా అయితే నువ్వు ఉద్యోగం చేసినట్టే."

"భేషుగ్గా చేస్తాను....మీరలాగే చూస్తుండండి....త్వరలోనే ప్రమోషన్‌కూడా తెచ్చుకుంటాను.... నా ఉద్యోగాన్నిగూర్చి మీరేమీ అనవసరంగా వర్రీ అవకండి.... వస్తాను సర్.... వస్తాను విక్రమ్‌గారూ!"

చైతన్య వెళ్ళిపోయింది.

"పిల్లకాదురా బాబూ పిడుగు!" అన్నాడు మాధవరావు కసిగా తనముందున్న కాలింగ్ బెల్ కొడ్తూ.

ప్యూను వచ్చి నిల్చోగానే కాసిని మంచినీళ్ళు తెచ్చిపెట్టు" అన్నాడు. నేను నవ్వుతూ సిగరెట్ వెలిగించుకున్నాను.

* * * *

ఆఫీసులో అందరూ చైతన్యను గూర్చే మాట్లాడుకోవటం మొదలుపెట్టారు.

ఆమె తల్లిదండ్రులెవరు? ఎక్కడ పుట్టింది? ఎక్కడ పెరిగింది? ఏం చదివింది? మొదలైన వివరాలన్నీ సేకరించారు.

వాళ్ళనాన్న అవ్వాళ్లోని పెద్ద ఆఫీసర్ అని తెల్సింది.... వాళ్ళ నేటివ్ప్లేస్ యెక్కడో గుంటూరుజిల్లాలో వుందిట. కాని వాళ్ళనాన్న ఇరవైయేళ్ళుగా తెలంగాణా ప్రాంతంలోనే ఉద్యోగం చేస్తుండటంవల్ల చైతన్య తెలంగాణాలోనే పుట్టిపెరిగింది- ఇక్కడే చదువుకుంది. బి.ఎస్.సి. సెకండ్ క్లాసులో ప్యాసైనా ఎం.ఎస్.సి. చదవటంకోసం ఎంట్రెన్స్ పరీక్షరాస్తే సీటు రాకపోవటంవల్ల ఈ ఉద్యోగం ఆమె కేవలం ఉబుసుపోకకుమాత్రమే చేస్తోందిట. ఏక్షణంలోనైనా రిజైన్ చేసి వెళ్ళిపోవచ్చునట.

"ఇలాంటివాళ్ళు ఉద్యోగాలెందుకు చెయ్యాలి? ఏపేదవాడి కైనా ఈ ఉద్యోగం వచ్చివుండేదిగా? వాడు బ్రతికిపోయేవాడుగా!" అన్న చర్చ మా ఆఫీసులో మరోసారి వచ్చింది.

"ఈమె ఈ ఉద్యోగానికి రానంతమాత్రాన ఈ ఉద్యోగం ఎవడైనా పేదవాడికే వెళ్ళేదన్న నమ్మకమేముంది? ఎవడో బాగా వున్నవాడి కొడుకేక్కి వెళ్ళడన్న గ్యారంటీ ఏముంది?" అని నేను వాదించాను.

నేనెప్పుడు చైతన్య పక్షమే మాట్లాడ్తానని నాకు ఆమెకు మధ్య "యేదో" వుందని మావాళ్ళు చెప్పుకోవడం ప్రారంభించారు.

స్త్రీకి పురుషునికి ఈ 'ఏదో వుండటాన్ని' గూర్చిన ఊహా గానాలు ఈ దేశంలో అత్యంత సహజంగా ప్రారంభమవుతాయి.

ఓ ఆడ్పిల్ల, అబ్బాయి కాస్తక్లోజ్‌గా తిరిగినంతమాత్రాన కాస్త స్వేచ్ఛగా మాట్లాడుకున్నంత మాత్రాన ఇద్దరి మధ్య ఏదో

వున్నట్లేనా? అసలు ఆ 'యేదో' అంటే ఏమిటి? యిద్దరి మధ్య లైంగికమైన సంబంధమనే మన వాళ్ళ వుద్దేశ్యం.... ఓ స్త్రీ పురుషుల మధ్య లైంగికమైన సంబంధం తప్ప మరో సంబంధం వుండటానికి వీల్లేదని మనవాళ్ళకో గట్టి నమ్మకం. ఇద్దరు స్త్రీ పురుషులు చనువుగా మాట్లాడుకున్నారంటే ఆ రాత్రి వాళ్ళిద్దరూ ఒకపక్కలో పడుకున్నారనే మనవాళ్ళు ఊహిస్తారు. అలా ఊహించటంలో, అలా ఆలోచించటంలో, వాళ్ళు ఊహించినదాన్ని నలుగుర్లో ప్రచారం చెయ్యటంలో వాళ్ళ మోటివ్ ఏమిటో ఎనలైజ్ చెయ్యటానికి ప్రయత్నించాను. ఇందుకు చాలావరకు మన వివాహ వ్యవస్థే కారణమనుకుంటాను. ప్రతి పురుషుడికి తన భార్యతో చాలా త్వరలోనే మొహం మొత్తిపోతుంది. స్త్రీని గూర్చి తను ఊహించుకున్నంత మధుర సుఖాలేవీ తన భార్యద్వారా పొందలేకపోయానన్న అసంతృప్తి వాడిలో ప్రారంభమవుతుంది. జీవితం చాలా డల్‌గా, చప్పగా మారిపోయినట్టనిపిస్తుంది. ఆ రొటీన్లోంచి బయటపడాలనుకుంటాడు. సినిమాలు చూస్తాడు - స్త్రీ పురుషుల మధ్య ఏర్పడే ప్రేమనుగూర్చి సినిమాల్లో ఎంతో మధురంగా మనోజ్ఞంగా చూపిస్తారు. అలాంటిదేదీ తన జీవితంలో జరగదు. అలా అని వివాహ వ్యవస్థను ఛేదించుకుని బయటపడలేడు. భార్య పిల్లలు, సంసారం ఇవన్నీ వాడిమెడ చుట్టూ గుదిబండల్లా తయారవుతాయి. వాడి యౌవనంలో జీవితాన్నిగూర్చి కన్నకలలన్నీ వాడి హృదయాంతరాళంలో ఎక్కడో అణిగిమణిగి వుంటాయి. వాటిని తీర్చుకునే మార్గంలేదు. తీవ్రమైన అసంతృప్తితో ఓ ఫ్రస్ట్రేటెడ్ లైఫ్ గడుపుతున్న ఇలాంటివాళ్ళకు ఎవరో యిద్దరు స్త్రీ పురుషులు పెళ్ళి చేసుకోకుండానే చనువుగా వుంటున్నారని తెలిసినప్పుడు యేదో భయంకరమైన అన్యాయం జరిగిపోతున్నట్టు అనిపిస్తుంది. ఇందుకు ప్రధానమైన కారణం - జెలసీ - ఈర్ష్య! తాను పొందలేకపోయిన సుఖాన్ని వాళ్ళు పొందుతున్నారన్న కడుపుమంట- అందుకే సమాజంలో ఇద్దరు స్త్రీ పురుషుల మధ్య ఏర్పడే 'సోకాల్డ్' అక్రమసంబంధానికంత ప్రాధాన్యత - తాము పొందలేకపోయిన సుఖాన్ని వేరేవాళ్ళు పొందటానికి వీల్లేదు తాము [illegible] చేసుకోలేకపోయిన [illegible] వేరేవాడు [illegible] చేసుకోవటానికి వీల్లేదు-

కాదు- ఒక్కయిద్దర్ని ఏర్పడిన ఆ అక్రమసంబంధాన్ని నలుగుర్లో ప్రచారంచేసి వాళ్ళనుఅవమానించాలి. శిక్షించాలి. సిలువ వెయ్యాలి. వాళ్ళకలా ఏకాంత చర్యలో సమాజానికేదో తృప్తి.... తమకంటే భిన్నంగా, ఉన్నతంగా జీవించబోయిన వాళ్ళకు తగినశాస్తి చేశా మని.... ఈ సామాజిక నీతి యేనాటికైనా మారుతుందా?

నన్ను మరో సందేహం బాధించసాగింది—

సెక్స్‌తో నిమిత్తం లేకుండా ఇద్దరు స్త్రీ పురుషులమధ్య నిజమైన స్నేహం సాధ్య మవుతుందా? ఇద్దరు పురుషులు స్నేహంగా వున్నట్టే ఇద్దరు స్త్రీ పురుషులు వాళ్ళ శరీరాలు కలవ కుండా- స్నేహంగ వుండగల్గుతారా?

నేను చైతన్యనుగూర్చి ఇంతగా ఆలోచించడానికి కారణం యేమిటి? ఆమెతో మాట్లాడినంతసేపు- మాట్లాడటంకాదు- మాట లతో పోట్లాడటం- ఎంతోహాయిగా. ఎంతో రిలీఫ్‌గా ఫీల్‌కావడానికి కారణం ఏమిటి? ఆమెను శారీరకంగా అనుభవించాలన్న బల మైనకోరికేదో నాలో నాకు తెలియకుండానే-ఫ్రాయిడ్ అనే 'సుప్త చైతన్యం'లో దాగివుందా? స్త్రీ పురుషులమధ్య సంబంధాలు ప్రధా నంగా సెక్స్‌ను ఆధారంచేసుకునే ఏర్పడతాయంటాడు ఫ్రాయిడ్. ఇది ఎంతవరకు నిజం? చైతన్యను నేను శారీరకంగా అనుభ వించలేనని తెల్సినప్పుడు ఆమెతో నేను మామూలుగా స్నేహం చెయ్యలేనా? ఆక్షణంనుంచి ఆమెను నేను ద్వేషించడం ప్రారంభ మవుతుందా? ఇప్పటివరకు చైతన్యతో నాకున్న సంబంధాన్ని సమీక్షించుకుంటే నాకొకటే స్పష్టంగా తెలుస్తోంది.... ఆమెపట్ల నాకేదో లైంగికమైన ఆకర్షణ యేర్పడినట్లు నాకెప్పుడూ అన్పించ లేదు- ఆమె పెద్ద అందగత్తెకాదు ఎంతో అందంగావుండే ఉమ ఎవరితోనూ మాట్లాడదు కాబట్టి ఆమెనుగూర్చి నేనెప్పుడూ ఆలో చించలేదు - చైతన్యలో కన్పించే ఆ అరొగెన్స్ - ఆ గర్వాన్ని చూస్తే నాకు వళ్ళు మండుతుంది. నాఅంత తెలివైనవాళ్ళు లేరన్న భావాన్ని ఆమె తన ప్రతి మాటలోనూ, ప్రతి చేష్టలోనూ చూ స్తుంది- ఆ గర్వాన్ని అణచివేసి నువ్వూ మామూలు ఆడదానివే అని రుజువుచెయ్యాలన్న కోరిక నాలో రోజు రోజుకూ బలపడ సాగింది- చైతన్యను ఏడిపించాలి. 'నాలో ప్రత్యేకతేమీ లేదు-

నేనూ మామూలు ఆడదాన్నే' అని గుర్తుచేయటానికి ఏదో చెయ్యాలి.... అంతకంటె ఆమెనుండి నే నాశిస్తున్న దేమీలేదు- నాలో ఇలాంటికోరిక కలగటానికి నాలోని 'మగబుద్ధి' కారణం కావచ్చు. 'పురుషాధిక్యత' అన్న తరతరాల ఈదేశపు సాంప్ర దాయం కావచ్చు.... యేమన్నాకావచ్చు.... ఐ డోంట్ కేర్....కానీ .... చైతన్యను ఏడిపించాలి.... కాని ఎలా....?

* * * *

నెలరోజులు గడిచిపోయాయి. మధ్యలో చాలాసార్లు చైతన్యను నేను టీకి ఇన్వైట్ చేశాను చైతన్య వన్నూ ఇన్వైట్ చేసింది. చైతన్య నాతోనే కాదు. ఆఫీసులో అందరితోను ఫ్రీగా మాట్లాడేస్తోంది. జోక్స్ చేసింది - నవ్వింది నవ్వించింది.

చాలాసార్లు నేను చైతన్యతో మాటల్తో గెలిచే ప్రయత్నం చేశాను కావాలని "ఆడబుద్ధి" ఎలాంటిదో చెప్పి ఆమెను ఉడికించే ప్రయత్నం చేసేవాణ్ణి. చాలా త్వరలోనే చైతన్యను ఉడికించా లంటే యేం చెయ్యాలో తెలుసుకున్నాను. ఆడవాళ్ళను, వాళ్ళ మెంటాలిటీని ఘాటుగా విమర్శించాలి. అంతే! చైతన్య రెచ్చి పోతుంది. ఆమెనలా రెచ్చగొట్టడం నాకు సరదాగా మారిపోయింది.

ఒకరోజు ఓ పిక్చర్ కెళ్ళాను. అదే పిక్చర్‌కు చైతన్య కూడా వచ్చింది.

"ఒక్కరే వచ్చారేమిటి?" అన్నాను చైతన్యను చూడగానే

"లేదు.... ఫ్రెండ్స్ వున్నారు. మీరూ....?"

"నాకూ ఫ్రెండ్స్ వున్నారండి. సినిమా చూట్టానికొచ్చిన వాళ్ళంతా నా ఫ్రెండ్సే...."

"మీ హృదయం చాలా విశాలమైనదిలాగుందే?"

"థ్యాంక్స్...."

"మీకు కంపెనీ లేకపోతే మా దగ్గర కూర్చోవచ్చు.... ఏమీ అబ్జెక్షన్?"

"ఎస్.... మెనీ అబ్జక్షన్స్?"

"వాటార్ దే?"

"అంతమంది ఆడపిల్లలమధ్య ఓ మగాడుంటే మీరు వాణ్ణి బతకనిస్తారా?"

వి వాడి యొకరి మెంటాలిటీ."

"ఎందుకూ?"

"ఆడవాళ్ళు మగవాళ్ళు అన్నదృష్టితో తప్ప అందరం మనుషులం.... స్నేహితులం అన్నదృష్టితో చూడటం మీ మగాళ్ళ కెప్పుడలవడ్తుంది."

"మీ ఆడవాళ్ళ కలవడిందా?"-

"మీకంటే చాలావయం"-

"అలా అయితే మీరు ప్రతిసారి మగవాళ్ళను సెపరేట్ చేసి దుయ్యబడ్తారెందుకని? మగవాళ్ళను మీరెప్పుడైనా మనుషుల్లా చూశారా?

"నేను దుయ్యబడ్తేది మగవాళ్ళనుకాదు.... మగవాళ్ళనవన్త త్వాన్ని.... ఈమగవాళ్ళ కల్పించినతరతరాల సాంప్రదాయాన్ని.... స్త్రీని ఓసెక్స్ అబ్జెక్టులా కాకుండా నార్మలు హ్యూమన్ బీయింగ్గా చూడలేని మగవాళ్ళ బలహీనతని...."-

"పురుషుణ్ని మీరుమాత్రం ఓ హ్యూమన్ బీయింగ్గా చూస్తున్నారేమిటి? తనకు చీరలు నగలు తెచ్చిపెట్టే ఓ సాధనంగా. ఓ యంత్రంగా మాత్రమే స్త్రీ పురుషుణ్ని చూస్తుంది.... సమాజంలో తన రక్షణను, తనకో స్థానాన్ని కల్పించిపెట్టేందుకే స్త్రీ పురుషున్ని వాడుకుంటుంది తన ఆకర్షణల్ని, తన ఆయుధాలన్నీ వాడిమీద వదుల్తుంది.... నిజం చెప్పాలంటే సమ షుడు కాదు స్త్రీని బానిసను చేసింది.... స్త్రీయే పురుషుణ్ని బానిసను చేస్తోంది.... ఇల్లు సంసారం, పిల్లలు - వీళ్ళకు ఊడిగం చెయ్యటానికే పురుషునికి జీవితమంతా గడిచిపోతోంది - పీటి అవసరం పురుషునికంటే స్త్రీకే ఎక్కువగా వుంటుంది - పురుషుడు స్వేచ్ఛాజీవి.... కాని వాడు ఓస్త్రీకి ఏక్షణంలో తాళికట్టాడో ఆ క్షణంలోనే వాడి స్వేచ్ఛ మంటగలిసిపోతుంది.... జీవితమంతా ఆ తాళికట్టి నావిడకు, ఆమె కనబోయే పిల్లలకు, ఆమె వుండబోయే ఇంటికి చాకిరీ చేయటంతోటే వాడికి సరిపోతుంది.... వాడు రెక్కలువిరుచుకుని సంపాదించే సంపాదనంతా ఆమెకోసం, ఆమె పిల్లలకోసం, ఖర్చుపెడ్తాడు.... మ్యాన్ ఈజ్ ది యాక్చువల్ స్లేవ్ ఆఫ్ ది వుమన్.... యూ కాంట్ డినై దట్."-

"ఐ షెల్ డెఫినిట్లీ డిసైడ్ దట్ .... బట్ .... యిప్పుడుకాదు.... పిక్చర్ స్టార్ట్ కాబోతోంది.... మా ఫ్రెండ్స్ పిలుస్తున్నారు.... వస్తాను...." – అంటూ చైతన్య వెళ్ళిపోయింది.

నాతో నేను వస్తున్నాను.... చైతన్య ఆ సినిమాచూడదు-నే పిన్న మాటల్నిగూర్చి ఆలోచిస్తూంటుంది రేపు నాతో పోట్లాడటానికి ఘాటైన మాటలనే ఆయుధాల్ని మారుస్తూవుంటుంది.

టికెట్ తీసుకుని నేనుకూడా లోపలి కెళ్ళాను. అంతా కొత్త నటీనటుల్తో తీసిన ఆ పిక్చర్లో స్త్రీ స్వాతంత్ర్యం, స్త్రీ కేదో అన్యాయం జరిగిపోతుంది గొంతులు చించుకునే బాగా చదువుకున్న ఆధునిక యువతుల మీద చాలావిసుర్లే వున్నాయి.

స్త్రీ స్వాతంత్ర్యంలాంటి ఆధునిక వినాదాల్ని నమ్మి చదువుకున్న ఆ ఆవాళ్ళు స్వర్గంలాంటి వాళ్ళ సంసారాల్ని నరకంగా ఎలా మార్చుకుంటారో ఆ సినిమాలో చాలా బాగా చూపెట్టాడు డైరెక్టర్.

ఆ సినిమా చూస్తున్నంతసేపూ నాకు చైతన్యే గుర్తురావటం వల్లనేమో.... నాకా సినిమా బాగా నచ్చినట్టనిపించింది.

తెల్లవారి ఆఫీసుకురాగానే చైతన్యతో ఆ సినిమా 'చాలా బావుంద'ని చెప్పి బాగా ఉడికించాలని ఎదురుచూస్తున్నాను.

చైతన్య రావటమేతడవుగా - "హల్లో విక్రమ్! నిన్నటి సినిమా చాలా బావుందికదూ!" - అంది.

నేను షాకైపోయాను. క్షణంసేపు ఆమెకేం జవాబు చెప్పాలో తెలియలేదు

"క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్...." అని ఇందుకే అంటారేమో. లేకపోతే ఈమెకు ఆ సినిమా నచ్చటమేమిటి?....

"మీకు.... మీకు.... నిన్నటిసినిమా నచ్చిందా?"—

"ఏం.... మీకు నచ్చలేదా?"—

"నాకు నచ్చటం, నచ్చకపోవటం అంత ముఖ్యంకాదు.... నాని మీకా సినిమా నచ్చిందంటే.... మీ అంత హిపోక్రాట్ ఈ ప్రపంచంలో మరెవరూ వుండరు!"—

"ఈ దేశంనిండా హిపోక్రాట్లే వున్నారు .... అందులో నే నొకతెను. అవటానికేంగలే? నాకాసినిమా నచ్చిందని చెప్పినప్పట్నుంచీ మరింత గింజుకుంటున్నారెందుకూ....నాకు నచ్చదని

మీరు మొదటి ఒక కన్‌క్లూజన్‌కొచ్చారన్నమాట ...మీ గెస్ తప్పి పోయిందని గింజుకుంటున్నారు.... అవునా?"

"నాన్‌సెన్స్.... నేనేమీ గింజుకోవటంలేదు.... పొద్దున లేస్తే ఈదేశంలో స్త్రీలకు స్వాతంత్ర్యంలేదూ, స్త్రీలను మగవాళ్ళు బానిసలకంటే హీనంగా చూస్తున్నారు.... స్త్రీ తిరగబడాలి.... పురుషాధిక్యతని ధిక్కరించాలి అని గొంతుచించుకునే మీకు ఆ సినిమా నచ్చిందంటే నవ్వాలో, ఏడవాలో అర్థంకావటంలేదు. ఆ సినిమాలో చదువుకున్న మీలాంటి స్త్రీలను ఎంత అవమానించాడా డైరెక్టర్! మీకో ఏమాత్రం ఆత్మగౌరవం మిగిలివున్నా మీ చదువుకున్న స్త్రీలంతా ఆ సినిమా ప్రదర్శనను వెంటనే నిలిపివేయాలని ఆ సినిమాహాలుముందు పెద్ద ప్రదర్శనను ఆర్గనైజ్ చెయ్యాలి. పెద్ద పెద్దమాటలు మాట్లాడగానే సరిపోయిందా? నిత్యజీవితంలో వాటిని ఆచరించే చేవలేనివాళ్ళకు పెద్దపెద్ద ఆదర్శాలు వల్లించే అర్హతలేదు...." అన్నాను చాలా సీరియస్‌గా

నేను పూర్తిచేసేలోపునే చైతన్య ఓ పిచ్చివాణ్ని చూసి నవ్వినట్టు గొల్లున నవ్వింది. ఎదుటివాణ్ని ఎంతో అవమానిస్తున్నట్టుగా ఎంతో అరోగెంట్‌గా ఆమెనవ్వే ఆ నవ్వంటే నాకు పరమ అసహ్యం.... ఆమె రెండు చెంపలూ వాయించి "యూ షటప్.... సిల్లీ ఫూల్...." అని పెద్దగా అరవాలనిపించింది.

అర్థంపర్థంలేకుండా ఏమిటా వెకిలినవ్వు....? ఆడవాళ్ళు అలా వెకిలిగా నవ్వితే పరమ అసహ్యంగా వుంటుంది నాకు!"

ఆమె యింకా నవ్వుతూనే ఉంది.

"మగవాళ్ళు వెకిలిగా నవ్వితే అసహ్యంగా వుండదా" అంది.

".... పోన్లెండి .... మీకంత అసహ్యంగా వుంటే నేనెందుకు నవ్వాలి? ఆ సినిమా నాకెందుకు నచ్చిందో చెబుతాను.... అంతా కొత్తవాళ్ళు, ఎంతబాగా యాక్టుచేశారు! డైరెక్టర్ తను చెప్పదల్చుకున్న విషయాన్ని చక్కగా ఎంతో పటిష్టంగా చెప్పారు...."

"చెప్పదల్చుకున్న విషయాన్ని చక్కగా ఎంతో పటిష్టంగా చెప్పారు...." అప్రయత్నంగా ఆమె గొంతును అనుకరిస్తూ

ఆమెను ఎక్కిరించాను— ....అ ఒప్పుకున్నావు !
ఎలా వుంది? మొగుడు తిట్టినా తన్నినా, వాడు పరమదుర్మార్గుడు, తాగుబోతు అయినా వాడ్ని భరిస్తూ, వాడికి ప్రతిరాత్రి కళ్ళు మూసుకుని తన శరీరాన్ని అర్పించి ఎన్నికష్టాలొచ్చినా శాంతంగా నోరు మెదపకుండా భరించే స్త్రీ నరకంలాంటి తన కాపురాన్ని స్వర్గంచేసుకోగల్గుతుందని.... స్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కావాలని, స్త్రీ కూడా గౌరవంగాబ్రతకాలని దుర్మార్గుడు తాగుబోతు అయిన భర్తను స్త్రీ వదిలేసినా పరవాలేదని నమ్మే స్త్రీయేమో స్వర్గంలాంటి తన కాపురాన్ని నరకం చేసుకుంటుందని.... ఇనా వాను చెప్పేది. ఈ ట్రాష్‌ను మీరు బాగుందంటారా! మీ రేంమాట్లా డుతున్నారో మీకు తెలుస్తోందా?" అన్నాను చాలా ఆవేశంగా.

ఆమె మళ్ళీ నవ్వింది— "ఓ తెలుగు సినిమాను ఇంత సీరియస్‌గా తీసుకున్నవాళ్ళను మిమ్మల్నే చూశాను. ఐ నెవర్ బాదర్ ఎబౌట్ థీమ్, రీజన్, లాజిక్, రియలిజమ్ ఇన్ ఎ తెలుగూ మూవీ.... ఎనీ మూవీ ఫర్ దట్ మ్యాటర్.... కమర్షియల్ సినిమా అంటే నా దృష్టిలో టైమ్‌కిల్లింగ్ బిటాసీలాంటిది. కూర్చున్నంత సేపు నాను మనను ఎంగేజి చేశాడా లేదా! దట్స్ హౌ ఐ జడ్జ్ ఎ పిక్చర్.... మీకో సంగతి చెప్పనా? నాకు జేమ్స్‌బాండ్ సినిమా లంటే చచ్చేంత యిష్టం.... ఆ సినిమాల్లో రీజన్, లాజిక్, యేమన్నా యేడుస్తాయా? బట్.... ఆ సీన్స్ ఆ ఫొటోగ్రఫీ జేమ్స్‌బాండ్ చేసే ఆ ఫీట్స్.... ఓ! సింప్లీ ఫెంటాస్టిక్.... జేమ్స్‌బాండ్ సినిమా పూర్తయ్యేలోగా ఓ పదిమంది అందమైన ఆడవాళ్ళతో పడుకుంటాడు.... కాదన్టే ఈ సినిమా స్త్రీలను చాలా అవమానిస్తోందని గొంతుచించుకుంటామా? కమర్షియల్ సినిమాలు అలాగే వుంటాయి. అన్ని సినిమాలు సత్యజిత్‌రాయ్ సినిమాల్లా వుండాలంటే దేశంలోని సినిమాహాల్సన్నీ మూసేసుకోవాలి. ఇప్పటికే ఈ దేశంలో జనం నిరుద్యోగంతో చస్తున్నారు సినిమా రంగంపైని సినిమాహాల్స్ మూతపడిపోతే ఇక చెప్పాలా?"

"ఇక ఏం చెప్పొద్దు.... మీ తెలివితేటలకు చాలా సంతో షించాంగాని సూపర్నెంటుగారొచ్చే టైమవుతుంది. మీరు కాస్త ఫైల్స్‌ని తెరవచ్చు."

... స్ ... ఇలా మీతో మాట్లాడుతుంటే చాలా హాయిగా వుంది."

"ఎందుకూ? నన్నుకూడా ఓ బ్లాక్‌మెయిల్లింగ్ బటానీలా వాడేసుకోండి ఎదుటివాణ్ణి ఎక్స్‌ప్లాయిట్ చెయ్యటంలో మీ ఆడ వాళ్ళను మించిన వాళ్ళులేరు" అన్నాను.

"అదిగో.... అదే వద్దన్నాను మాటమాటకు ఆడవాళ్ళు ఆడవాళ్ళు అంటూ యిలాంటి సిద్ధాంతాలు వల్లించవద్దని ఎన్నిసార్లు చెప్పాను మీకు?....ఛీ! మీతో మాట్లాడటం వాదేఖర్థితక్కువ....
అకస్మాత్తుగా చైతన్య చాలా సీరియస్‌గా మారిపోయింది. ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి అది నాకు కన్పించకుండా వుండటానికి చాలా ప్రయత్నం చేసింది నాలోపల నాకు తెలియకుండానే యేదో ఆనందపు కెరటం లేచివస్తోంది.... ఎలాగైతేనేం.... ఆమెను ఏడి పించాను చివరకు సాధించాను! నాలోని అహం విజయగర్వంతో యెగిరివస్తోంది. కాని.... కాని.... యేంటి! ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ మూర్తీభవించిన చైతన్యంలా ప్రకాశించే చైతన్య అక స్మాత్తుగా యెందుకేడ్చింది? నేనామెను గాయపరచానా? చాలా ఫూలిష్‌గా మాట్లాడానా? ఆమెదగ్గరకెళ్ళి ఆమె కళ్ళలోకి చూస్తూ "సారీ చైతన్యా.... ఎక్స్‌ట్రీమ్లీ సారీ!"— అని ఆమెను ఓదార్చా లన్పించింది. నా గుండెలకు హత్తుకోవా లన్పించింది.... కాని.... ఇంతలో మావర్కింటు వచ్చాడు. ఆఫీసుకు రావల్సిన వాళ్ళంతా వచ్చారు. దామోదర్ వచ్చి ఏవేవో మాటల్లోకి దించాడు.

ఆ రోజంతా చైతన్య నాతో మాట్లాడలేదు నేనే మాట్లా డిద్దామనుకున్నాను — 'సారీ' అందామనుకున్నాను. కాని నాలో నాకు తెలియకుండానే వున్న శక్తులేవో నన్నాపని చెయ్యనివ్వలేదు.

నాలో 'అహం' పాలు కొంచెం ఎక్కువే వనుకుంటాను. ఆమెను నే నేమన్నానని.... నే నెందుకు 'సారీ' అనాలి? ఆడ వాళ్ళకు ఈ 'ఏడుపు' అనేది ప్రకృతి ప్రసాదించిన ఓ బ్రహ్మాండ మైన ఆయుధమని నమ్మేవాళ్ళలో నే నొకడిని....ఏడుపుతో ఎదుటి వాణ్ణి యిట్టే వశపరచుకుంటారు .... తన పాదాక్రాంతుణ్ణి చేసు కుంటారు.... ఎంతటి బలిష్ఠునన్నైనా స్త్రీ ఏడుపుతో జయించ గల్గుతుంది.... ఎంత స్థిరచిత్తుణ్ణయినా ఎంతటి అదవిమనిషినైనా

ప్రతి ఏడుపుతో తిరవితిం చిటికి గిల్గుతుంది. చైతన్య ఆ
ఆయుధాన్ని నామీద ప్రయోగించింది.... నన్ను లొంగదీసుకోవా లని.... నాచేత క్షమాపణ చెప్పించుకోవాలని.... ప్రయత్నించింది. నేనెందుకు లొంగిపోవాలి? నేనెందుకు క్షమాపణ చెప్పుకోవాలి? ఐ విల్ నెవర్ డూ దట్.

కాని ఆరోజంతా చైతన్య నాతో మాట్లాడకపోవటం నాకెంతో వెలితిగావుంది.... ఏదో పోగొట్టుకున్నట్టుగా వుంది. మేమిద్దరం మాట్లాడుకుంటూ వుంటే - పక్కవాళ్ళకూడా ఎంతో కాలక్షేపం అవుతూవుండేది ఆఫీసంతా యెంతో సందడిగా వుండేది.

మేమిద్దరం మాట్లాడుకోకుండా కూర్చోవటంతో మా సూప రింటెండెంట్ మామధ్య ఏదో జరిగిందని చాలాసులభంగానే గ్రహించాడు.

"ఏమోయ్ విక్రమ్, మీరిద్దరూ మాట్లాడుకోవటం లేదేమిటి? పోట్లాడుకున్నారా?" అన్నాడు మాధవరావు.

"వాళ్ళు పోట్లాడుకోందెప్పుడు సార్? మీరీరోజు పోట్లాడు కోవడంలేదేమిటి? సీజ్ ఫైర్ ఎగ్రిమెంటేమన్నా చేసుకున్నారా అనడగాలి...." అన్నాడు పక్కనేవున్న దామోదర్. మేమిద్దరం తప్ప అంతా నవ్వారు.

ఆ తర్వాత మూడురోజులవరకు చైతన్య ఆఫీసుకు రాలేదు. హైద్రాబాద్ వెళ్తున్నానని లీవు పంపించింది— ఆ మూడురోజులు నాకు మూడు యుగాలుగా గడిచాయి—

నాల్గోరోజు చైతన్య ఆఫీసుకొచ్చింది. వెంటనే ఎదురుపడి మాట్లాడా లనుకున్నాను. కాని— మొదట నేనే ఎందుకు మాట్లాడాలి? ఆమే ఎందుకు మాట్లాడకూడదన్న ఏదో మొండిపట్టింపు.... త్వరగా ముందు ఆమే మాట్లాడితే ఎంతబావుండును. నేను వచ్చేటప్పటికి ఆమె ఉమతో మాట్లాడుతోంది. హైద్రాబాద్లో ఏదో ఆర్ట్ ఎగ్జిబిషన్ చూసిందట. ఆ విషయాన్ని గూర్చి ఎంతో ఉత్సాహంగా ఉమతో చెబుతోంది.

"....ఆ ఎగ్జిబిషన్లో జయదేవుని గీతగోవింద ఆధారంతో సాయికృష్ణ అనే ఆర్టిస్టు వేసిన బొమ్మలు చూశావే.... అబ్బ! ఎంత బావున్నాయో.... ఆ బొమ్మల్ని చూడటం నా జీవితంలో ఒక మర్చి పోలేని మధురాతిమధురమైన అనుభవం.... సింప్లీ సూపర్బ్....

... అదృష్టవశాత్తూ ఆ ఆర్టిస్టు కూడా అక్కడే వున్నాడు... అతన్నికూడా కలుసుకుని కొంతసేపు మాట్లాడగల్గినందుకు మరీ సంతోషించాను.... అతన్ని చూడగానే అత నో ఆర్టిస్టని వెంటనే చెప్పేవేలా వున్నాడతను. ఫెయిర్‌గా, సన్నగా వాజూగ్గా....చాలా చిన్నవయసే అతనిది.... కాలేజీలో చదివే కుర్రాడిలా వున్నాడు నేను 'మీ చిత్రాలు బాగున్నాయండీ, జయదేవుడి అష్టపదులకు అద్భుతమైన రూపకల్పన చేశారు. ఈనాడు ఆ జయదేవుడే వుంటే మీ చిత్రాల్ని చూసి నేనూహించిన రాధాకృష్ణులు ఇంత అందంగా వుంటారా?" అని ఆశ్చర్యపోయేవాడు"అని గబగబా నాధోరణిలో నేనుమాట్లాడేటప్పటికి పాపం.... తెగ సిగ్గుపడిపోయాడు....ఆడపిల్లల్తో ఎన్నడూ మాట్లాడి ఎరగని అమాయకుడిలా వున్నాడు....ఎక్కువ మాట్లాడలేదు.... 'అంతా మీ అభిమానమండి' అని ఒక్కమాటన్నాడు. ఆటోగ్రాఫ్ యివ్వమని అడిగినా తెగ సిగ్గుపడిపోయాడే...."ఆటోగ్రాఫ్ యిచ్చేంత గొప్ప వాడిని కాదండీ నేను" అంటాడు.... అతన్లోని మోడెస్టని చూస్తుంటే నాకు నిజంగా ముద్దొచ్చిందే...." పరవశంతో తన పరిసరాలను మర్చిపోయి ఓ ప్రవాహంలా చెప్పుకుపోతోంది చైతన్య.

"ముద్దుపెట్టుకోకపోయారా?" అన్నానేనేను వ్యంగ్యంగా. అతన్నలా ఆమె అదేపనిగా పొగుడుతూంటే నా కెందుకో నిప్పుల మీద కూర్చున్నట్టుగా వుంది.

"పెట్టుకునేదాన్నే, నా కేం భయమనుకున్నారా? అంత గొప్ప ఆర్టిస్టుని ముద్దుపెట్టుకోవటమే కాదు. వళ్లో పడుకోబెట్టుకు లాలించాలనిపించింది."

"వళ్లో ఏం ఖర్మ! పక్కలో పడుకోబెట్టుకోండి"—కసిగా అందామనుకున్నాను. నాలుక చివరిదాకా వచ్చిన ఆ మాటను నాలోనే దిగమింగుకుని— "లాలించక పోయారా?" అన్నాను.

"లాలించేదాన్నే.... అత నంత సిగ్గుపడిపోకపోతే!"—

"చాల్లేవే.... నువ్వూ మరీనూ...." అంది ఉష.

"ఆ చిత్రాల్నిచూస్తే నువ్వూ నాలాగే ఫీలవుతావే.... ఎంత బ్యూటీఫుల్‌గా వున్నాయో.... నా దగ్గరే వుంచేసి వాటినన్నింటినీ కొనేసి నా ఆల్బంలో దాచుకోవాలనిపించింది...."

"ఎందుకండీ.... ఆ బూజుపట్టిన ఫ్యూడల్ సంస్కృతిని ప్రతిబింబించే ఆ అర్ధనగ్న చిత్రాన్ని అంతగా పొగిడేస్తున్నారు!" అన్నాను.

"ఫ్యూడల్ సంస్కృతి ... గాడిదగుడ్డు సంస్కృతి.... నా కవంతా అనవసరం.... నా కంటికి నచ్చింది నా హృదయాన్ని కదిలించింది నాలో అనుభూతుల దొంతరల్ని పేర్చింది. నాకంతే చాలు. ఫ్యూడల్ సంస్కృతి.... బూర్జువా సంస్కృతి.... ప్రతి దాన్ని ఇలాంటి రంగు టద్దాల్తో చూడటమంటే నాకు పరమ అసహ్యం.... తెల్సిందా?" అంది రోషంగా చైతన్య.

"మీ కంటికి నచ్చితే చాలా? అది సమాజాని కెంతవరకూ ఉపయోగపడ్తుంది....అది సమాజాన్ని కాస్త ముందుకు తీసుకు పోవటానికి ఉపయోగపడ్తోందా, లేక వెనక్కి తీసుకుపోవటాని కుపయోగపడ్తోందా! అన్న మీమాంస మీకక్కర్లేదన్నమాట.... మీరు అంత పరవశంతో పొగడుతున్న ఆ అర్ధ నగ్న చిత్రం మీరు ఎంతోగాఢంగా నమ్మే కొన్ని భావాలకు వ్యతిరేకమని గుర్తించారా? అసలు జయదేవుని గీతగోవింద మేమిటి? అందమైన మాటలతో రాయబడిన ఓ ప్యూర్ సెక్సుకావ్యం! ఆ కావ్యంనిండా బూతులు.... సంస్కృతంకాబట్టి మన చెవులకు బూతుల్లాగా వినిపించవు. "రతి సుఖసారే...."— "గోపీ పీన పయోధర మర్దన...."- ఈమాటల్నే అచ్చతెలుగులో నే నంటే మీరంతా చెవులుమూసుకుంటారు- స్త్రీ అంటే ఒక విలాసవస్తువు.... పురుషుని చెలరేగే సెక్సుకోరికల్ని తీర్చటానికి సృష్టి ప్రసాదించిన వరం స్త్రీ - అన్న నమ్మకంతో మన కవులు ఎన్నోకావ్యాలు రాశారు- ఆ కావ్యాలనిండా స్త్రీల తొడల్ని, వక్షముల్ని కుచాల్ని అదేపనిగా వర్ణించారు ... గీత గోవిందలోకూడా జయదేవుడుచేసిన పని ఇదే- స్త్రీని ఓ విలాస వస్తువుగా చూడటం ఫ్యూడల్ సంస్కృతిలోని ఒక ముఖ్యమైన భాగం.... అలాంటి సంస్కృతిని బొమ్మల్లో చిత్రిస్తే మీరు పైపై మెరుగుల్నిచూసి పరవశంతో పొంగిపోతున్నారు.... మీరు నమ్మే అభ్యుదయ భావాలేమైపోయాయి? స్త్రీని సెక్సు ఆబ్జెక్ట్‌గాచూస్తేనాకు ఒళ్ళు మండుతుందని వాదించారే.... అలా వాదించింది మీరేనా? మీమాటలకు చేష్టలకు ఎక్కడా పొంతనలేదని.... మరోసారి రుజువైంది.... యూ ఆర్ ఎ గ్రేట్ హిపోక్రాట్, దయచేసిమీరు

మరోసారి పెద్ద అభ్యుదయవాదిగా ఇంకెక్కడైనా ఫర్వాలేదుగాని కనీసం నాముందు ఫోజు కొట్టకండి...."— చివర్లో నాగొంతు చాలా కఠినంగా ధ్వనించింది.

"ఔను.... ఫోజు కొడ్తాను.... నాయిష్టంవొచ్చినట్టు ఫోజు కొడ్తాను.... పెద్ద అభ్యుదయవాది బయల్దేరాడు.... ఈపెడ అభ్యుదయానికి వ్యతిరేకి.... పేద్ద హిపోక్రెట్ అని ఈవూరంతా టామ్ టామ్ చెయ్యండి. నాకేం భయంలేదు- తెల్సిందా? మొన్నటిదాకా ఆడవాళ్ళే మొగవాళ్ళని బానిసలుగా చూస్తున్నారని వాదించిన ఈ అభ్యుదయవాది ఉన్నట్టుండి హఠాత్తుగా ప్లేటు ఫిరాయించేసి సూపర్ అభ్యుదయవాదై పోయాడు.... మీరేహిపోక్రాట్.... సమయానుకూలంగా ప్లేటు ఫిరాయించే అవకాశవాదిస్తు.... ఐ హేట్ యూ లైక్ ఎనీథింగ్."- కోపంతో, ఎక్సైట్ మెంట్ తో తనను తాను మరచిపోయింది చైతన్య మరుక్షణంలో ఆమె ముఖమంతా ఎర్రబడిపోయింది ఆమె కళ్ళల్లో కన్నీళ్ళు ఉబికివచ్చాయి

కాస్సేపట్లో తన్నుతాను సంబాళించుకుని, "నన్ను ఏడిపించావని మీ ఫ్రెండ్స్ దగ్గర గొప్పలు చెప్పుకుని మురిసిపోకండి.... మీరేదో అన్నారని మీ మాటలకు జవాబు చెప్పటం చేతకాక అందరి ఆడవాళ్ళలాగే నేను యేడ్చానని పొరబడకండి.... నాకు బాగా ఆవేశం వచ్చినప్పుడు నాకు తెలియకుండానే ఏడుపు వచ్చేస్తుంది."

నేనేమీ మాట్లాడలేదు. పరిస్థితి ఇలాంటి టర్న్ తీసుకుంటుందని అనుకోలేదు. మూడురోజుల తర్వాత ఆఫీసుకొచ్చిన చైతన్యతో సరదాగా మాట్లాడదామనుకున్నాను. కాని మళ్లీ ఏడిపించాను - లోపల ఒకపక్క ఏదో వెర్రి ఆనందం.... మరోపక్క చాలా పూలిష్ పని చేశానని నన్ను నేను తిట్టుకోవటం.

కనీసం ఈసారైనా "అయామ్ సారీ చైతన్యా" అందామనుకొన్నాను. కాని చెప్పాలనుకుంటే నాలో అహం పొలికేకలుపెట్టేం ఎక్కువైపోయేది.

లంచ్ టైంలో "టీకి వెళదాం రండి" అని చైతన్యను పిలిచాను రానంటుందేమో అనుకున్నాను

"రోజూ పదిసార్లు టీ తాగటం, నాలుగైదు పాకెట్లు సిగరెట్లు తాగెయ్యటం అభ్యుదయమే అవుతుందా. అభ్యుదయవాది

గారూ...." అంది చైతన్య.

"ప్యూడల్ ఆర్ట్‌మీద తగలేసిందానికంటే ఇది చాలా నయం" "ఔనౌను.... మనమేంచేస్తే అది ఘనకార్యం అన్నట్టు మనమేంచేస్తే అది అభ్యుదయం నెలకు ఇరవైరూపాయలు కూడా తెచ్చుకోలేని ప్రజలు ఈ దేశ జనాభాలో సగంకంటే ఎక్కువ మంది వుంటే మనమంతా రోజూ గోల్డ్‌ప్లేక్ సిగరెట్‌ప్యాకెట్లకొద్దీ తగలెయ్యొచ్చు స్కాచ్ విస్కీ బాటిల్స్ ఖాళీ చెయ్యొచ్చు.... అంతా అభ్యుదయమే.... పదండి...." అంటూ చైతన్య తన సీట్లోంచి లేచింది."

ఇదే విషయాన్నిగూర్చి క్యాంటిన్లో కూడా ఓ గంటసేపు వాదించుకున్నాము.

• • • •

రెండుమూడురోజులతర్వాత చైతన్య-"ఈరోజు సాయంత్రం మాయింటి కోసారి వస్తారా?"- అంది

"మీరు రమ్మంటే తప్పకుండా వస్తాము....ఏమిటి విశేషం? కొంపదీసి ఈరోజు మీ బర్త్‌డేగాని కాదుకదా?" -

"బర్త్‌డే కామూ గాదిదగడ్డూకాదు.... పిలిచాము.... ఇన్ని మాటలెందుకు, వస్తారా, రారా?" -

"అంత కోపగించుకోకండి.... మీరు కోసం వచ్చింకంటే యింకేంలేదు బోల్డు కన్నీళ్ళు వేస్టయిపోతాయి...."-

"వేస్టయితే అయ్యాయి.... నాకు ఏమిటొస్తే: ఏడవాలన్పిస్తే ఏడుస్తాను.... మీకేవరు అపలేరు." -

"కృష్ణశాస్త్రిగారి అనుంగు శిష్యురాల్లా వున్నారే.... నన్ను మనసారగా ఏడ్వనీరు.... మీరు' అంటూ గొంతెత్తి కవిత్వంతో ఏడుస్తారు...." -

'కృష్ణశాస్త్రి కవిత్వమంటే నాకు ప్రాణం, అని నేనంటే మీరు తక్షణం అది ఫ్యూడల్ కవిత్వం అనేస్తారేమో?"-

"ఔను....మీగెస్ కరక్టే...., అది అక్షరాలా ఫ్యూడల్ కవిత్వమే...." -

"గో టు హెల్"-

"ఇవ్వాళ సాయంత్రం వస్తున్నారుగా....అక్కడికేనా?"-

"ఏమిటీ.... మా ఇల్లును హెల్ అంటారా ? అయితే మీరు మా ఇంటికి రావల్సిన అవసరంలేదు...." -

"నేనన్లేదు.... ఇంటికి రమ్మనిపిల్చి గోటు హెల్ అంటే ఏమనకోవాలి? అన్నీ మీరే అని నాకంటగడ్తున్నారు.... ఎంతయినా"-

"స్టాప్.... 'ఎంతయినా ఆడవాళ్ళు' అని అన్నారో, మీకు నాకూ గుడ్‌బై" -

"సరే.... అనన్లెండి...." -

"అయితే ఈరోజు మాఇంటికొస్తున్నారా ?" -

"రమ్మన్నారగా...."

"నేను రమ్మన్నాననే వస్తున్నారా?"

"రమ్మనకుండానే రమ్మంటారేమిటి"

"మీకు నిజంగా రావాలన్పిస్తే అసలే చేసేవాళ్ళు...."

"నాకు రావాలన్పించింది.... కాని అంత సాహసం చెయ్య లేకపోయాను."

"మీతో పాటు పనిచేసే మీ కొలీగ్ ఇంటికి రావడంకూడా సాహసమేనన్న మాట ..."

"ఈ దేశంలో అంతే:"

"ఫ్యూడల్ దేశంలోనా?"

"ఔను...."

"వస్తాను"—

"నన్ను రమ్మని మీరు వస్తానంటారేమిటి?"

"అయ్యో! వెళ్ళొస్తాను అని చెబుతున్నాను."

"నిజంగా ఈరోజు సాయంత్రం నన్ను మీ ఇంటికి రమ్మంటారా?"

"నేను తెలుగులోనే చెప్పాను".

"అఫ్‌కోర్స్.... అది నిజమే ననుకోండి.... మీఇల్లెక్కడ?"

"కిషన్‌పురాలో ఆర్. డి. ఓ. శ్రీనివాసరావుగారిల్లెక్కడ అని అడగండి.... ఎవరైనా చెప్తారు...."

"థాంక్స్.... ఎవరైనా చెబుతారని చెప్పినందుకు...."

"థాంక్స్ అంటారా?"

"ఇంకెందుకనుకున్నారు?"

"యింటికి రమ్మని పిల్చినందుకు థాంక్స్ చెబుతున్నారేమో ననుకున్నాను.... వస్తాను మరి...."

"యింతకూ ఎన్నింటికి రమ్మంటారు?"

"ఎన్నింటికైనా ఫర్వాలేదు...."

"అర్ధరాత్రి పన్నెండింటికి వస్తాను....

"తోటి ఉద్యోగి యింటికి రావడమే సాహసమనుకునే మీరు అంత సాహసం చెయ్యలేరని నాకు తెలుసు-"

"అంత సాహసం చేశాననుకోండి.... ఏంచేస్తారు?"

"ఏమీ చెయ్యను....తలుపులన్నీ తెరచి మిమ్మల్ని ఇంట్లోకి ఆహ్వానిస్తాను."

"నిజంగానా?"—

"వచ్చి చూడండి.... మీకే తెలుస్తుంది...."-అంటూ చైతన్య వెళ్ళిపోయింది.

* * * *

చైతన్య ఇంటికెళ్తే ఏం మాట్లాడతుంది? అక్కడా పోట్లాడుకోవటమేనా? గుండెలోతుల్లో గుసగుసలాడే ఎన్నో భావాలను ఆమెతో పంచుకోవాలని వుంటుంది కాని ఆమెను చూడగానే అన్నీ మరచిపోతాను. సంభాషణ ధోరణే మారిపోతుంది.... మాటలతో ఒకర్నొకరం గెలవాలన్న వెర్రి ప్రయత్నం.. మాటల్తో ఒకర్నొకరం హింసించుకోవాలన్న మొండిపట్టుదల. మన అసలు ఫీలింగ్స్‌ని బయటపెట్టుకోకుండా జాగ్రత్తపడాలన్న అప్రయత్న ప్రయత్నం. ఒకరికో ఒకరం ఇలా ఆడుకుంటున్న ఈ నాటకం ఎలా పరిసమాప్తి చెందబోతోంది? చైతన్యనుండి నేనేం ఆశిస్తున్నాను? ఎందుకు నన్నా అమ్మాయి ఇలా ఉసిగొల్పుతుంది?

కాలేజీలో చదువుకునేరోజుల్లో కన్నకలలేవీ నిజంకాలేదన్న ఫ్రస్ట్రేషన్లో.... ఒక నీరవ నిస్తబ్ద జీవితంలోకి జారిపోతున్న తరుణంలో చైతన్య నా జీవితంలో ప్రవేశించింది. ఒకప్పటి జీవితంమీద మమకారాన్ని నాలో మళ్ళీ రగిలించింది - నేను అనుక్షణం కోరుకునే వినూత్నతను నా జీవితంలో ప్రవేశపెట్టింది. నా అంతరంగంలో, నా చైతన్యస్రవంతిలో ఆమె ఒక అంతర్భాగమైపోయింది. ఆమెతో పోట్లాడటంలో ఏదో థ్రిల్....

ఆమెను ఏడిపించటంలో ఏదో ఆనందం.... ఆమెను మాట్లాడించ టంలో ఆమెను రెచ్చగొట్టటంలో - ఆమెతో మాటామాటా పెంచు కోవటంలో ఏదో సంతృప్తి.... ఏమిటిదంతా?

చాలాసార్లు ఆలోచించాను. ఇదంతా ఆమెను నేను సెక్సు వల్గా అనుభవించాలని కోరుకోవటంవల్ల ఉత్పన్నమవుతున్న దేనా? ఆమెను ఆ దృష్టితో నేనెన్నడూ చూడలేదు.

నా సుప్తచైతన్యంలో అలాంటిదేమన్నా వుందా? ఏమో.... తెలీదు.... మేలుకువవున్నప్పుడు చైతన్యనుగూర్చి ఎంతో ఆలో చిస్తాను. కాని నిద్రపోయాక ఎప్పుడైనా కల్లోకివస్తుందేమో. దాన్ని బట్టి నా సుప్తచైతన్యంలో చైతన్యనుగూర్చి ఎలాంటిభావన నాలో వుందో విశ్లేషించుకోవటానికి అవకాశం కల్గుతుందనుకున్నాను కాని.... చైతన్య నాకల్లోకెప్పుడూ రాలేదు.

చైతన్య నా గూర్చి ఏమని ఆలోచిస్తుంది?

చైతన్యలో అసలు సెన్సిటివ్ ఫీలింగ్స్ అనేవి వుంటాయా? ఎప్పుడూ అలా గలగలా వాగటంతప్ప ఆ అమ్మాయి శాంత స్థిమితంగా ఎప్పుడైనా ఆలోచిస్తుందా? ఎదుటివ్యక్తి మనకు ఎంతో తెలిసినట్టనిపించినా ఆ వ్యక్తి అంతరంగంలో ఏముందో చెప్పటం ఎంత కష్టం!....

ఇలా ఆలోచిస్తూ కిషన్‌పురా చేరుకున్నాను.

అప్పుడే వీధిలైట్లు వెలిగాయి

హనుమకొండలో కిషన్‌పురా ప్రాంతం అంటే నాకు చాలా యిష్టం. మొత్తం టౌన్లోకల్లా ఇక్కడే శాంత ప్రశాంతంగా వుంటుంది. ఏ ఇంట్లోచూసినా మల్లెపూలు నైట్‌క్వీన్ పరిమళాలు గుబాళిస్తుంటాయి.

ఆకాశం అరుణకాంతుల్ని పులుముకుంటోంది. నాలో కవితా వెల్లువ పొంగిపొర్లుతోంది. చాలాకాలం తర్వాత అకస్మాత్తుగా నాలో ఈ క్రియేటివ్ అర్జ్! ఏదో రాయాలన్న తహ తహ..... కాలేజీలో చదువుతునే రోజుల్లో నేనూ కవిత్వం గిలికినవాడినే....

"చైతన్య ఇంటిని కనుక్కోవటం ఎలా? రోడ్డుమీద ఎవరూలేరు. ప్రతీ ఇంటిని పరీక్షగాచూస్తూ కొంచెం దూరం నడవ గానే ఓ ఇంట్లోంచి — "అబ్బబ్బబ్బ.... దువ్వెనెక్కడ తగ

లేకారే.... ఈ ఇంట్లో సమయానికి ఏదీ దొరికిచావదు. ఈ ఇంటి కంటే ఓ అడవి నయం...." అన్న చైతన్య మాటలు వినిపించాయి.

అమ్మయ్య! ఎవర్నీ అడగాల్సిన పనిలేకుండానే వాళ్ళ యింటిని చేరగల్గాను!.... ఇంటి ముందు జి శ్రీనివాసరావు, ఆర్. డి. ఓ. అన్న బోర్డుకూడా వుంది.

గేట్లో అడుగుపెడ్తుండగానే - "రండి.... రండి.... దిసీజ్ మై హెల్.... ఈ హెల్ను సులభంగానే తెలుసుకున్నట్టున్నారే!" అంటోంది చైతన్య.

అప్పుడే తలంటిపోసుకున్నట్టుంది. వెంట్రుకలన్నీ విరబోసుకుని వుంది. చైతన్యవి చాలా పొడవైన వెంట్రుకలు.... నల్లని నల్లని వత్తైన ఆ కురులమధ్య గుండ్రని చైతన్య మొహంమీద గొప్ప కాంతితో ప్రకాశిస్తూన్న ఆమె నక్షత్రాల్లాంటి కళ్ళు.... చైతన్యను ఆలా చూడటం ఒక దివ్యమైన అనుభవం నాకు!

"ఏమిటలా చూస్తున్నారు. వెంట్రుకలన్నీ విరబోసుకుని దయ్యంలా కన్పిస్తున్నానా ఏమిటి కొంపదీసి!" -

"దిసీజ్ మై హెల్. అన్నాడగా!" వుండేది దయ్యాలేగా!"

"అక్కడాలా దయ్యాలే.... ఇంతకీ ఈ హెల్ని ఎలా పట్టుకున్నారు!" -

"దయ్యాల రొద రోడ్డుమీద ఓఫర్లాంగుదూరం వినిపిస్తోంటే పట్టుకోవటం చాలా సులభమైపోయింది" -

చైతన్య గొల్లున నవ్వింది.

"అసలు మీకోవిషయం చెప్పటం మర్చిపోయాను. మా యింటినిగూర్చి ఎవర్నీ అడగాల్సిన పనిలేదు కిషన్పురాప్రాంతం లోకి వస్తే చాలు. నాకేకలు విన్పిస్తాయని చెబ్దామనుకున్నాను." -

"ఆవిషయం మీరు నాకు చెప్పాలా!" -

అవ్కోర్స్.... అక్కర్లేదనుకోండి....పాపం....త్వరలోనే మీరో ఇ. ఎన్. టి. స్పెషలిస్టు దగ్గరకు వెళ్ళాల్సి వస్తుందేమో!"-

"ఎందుకు!" -

"నాకేకలు వినీవినీ మీ చెవులు తూట్లుపడిపోయి పనిచెయ్యటం మానేస్తాయి. ఎందుకైనా మంచిది. ఇప్పుడే ఓ స్పెషలిస్టుని చూసిపెట్టుకోండి.... నరేగాని అలానిల్చునేవున్నా

రేమిటి.... నారూమ్కెళ్దాం రండి, వెధవజుట్టు .. ఎంతకూ లొంగదు బాబూ.... ఓ సెలూన్‌కెళ్ళి మొత్తం కట్ చేయించుకుంటే ప్రాణానికి హాయిగా వుండేట్టుంది. ఇక్కడ రేగిందంటే ఎప్పుడో అవనే చేస్తానండంటి...." - అంది చైతన్య చిందరవందరగా రేగివున్న జుట్టును ఓ ఆర్డర్‌లో పెట్టటానికి ప్రయత్నిస్తూ.

"వద్దండీ.... అంతపనిమాత్రం చెయ్యకండి."

"ఎందుకు చెయ్యొద్దేమిటి? మీలాగ ఇంతింత జుట్టుపెంచుకుని తిరిగే ఓపిక నాకు లేదుబాబు." -

"త్వరలోనే ఓ క్రొత్త ట్రెండ్ ప్రారంభమవుతుందేమో, ఆడవాళ్ళు జుట్టు తీసెయ్యటం....మగవాళ్ళు జుట్టుపెంచుకోవటం." -

"అలా అయితే నాకంటే సంతోషించేవాళ్ళెవరూ వుండరు. కూర్చోండి దిసీజ్ మై రూమ్. నాన్నగారింట్లో లేరు. వుంటేమిమ్మల్ని ఇంటర్ద్యూ చేసేవాళ్ళు.... బుక్స్ చూస్తుండండి.... యిప్పుడే వస్తాను." చైతన్య లోపలికెళ్ళింది

గదంతా చిందరవందరగా వుంది. వనిత, మహిళ, ఆంధ్ర జ్యోతి ప్రభ స్వాతి, జ్యోతి, విజయచిత్ర, సితార మొదలైన పత్రికలన్నీ ఎక్కడపడితే అక్కడపడి దొర్లుతున్నాయి. బీరువాలో వున్న బుక్స్‌కూడా అలాగే వున్నాయి చైతన్య మాటల్లోలాగే ఈ గదిలోకూడా ఎక్కడా ఆర్డర్ వున్నట్టు కనిపించలేదు బుక్స్ కాసేపు పరీక్షించాను చలం బుచ్చిబాబు, శ్రీశ్రీ, కృష్ణశాస్త్రి తిలక్ మొదలైన రచయితలంటే చైతన్యకు ప్రత్యేకమైన అభిమానంలావుంది వాళ్ళపుస్తకాల్లో ఎక్కడెక్కడా అండర్‌లైన్ చెయ్యడం గమనించాను.

కాస్సేపట్లో రెండు సాసర్లలో మైసూర్‌పాక్ పట్టుకుని చైతన్య వచ్చేసింది.

"అంతా ఫ్యూడల్ సాహిత్యంకదండి ..."

"యిదేమిటి స్వీట్ తినిపిస్తున్నారు.... తలంటి పోసుకున్నారు.... ఈ రోజు మీ పుట్టినరోజేమోనని నా నమ్మకం.... యామై కరెక్ట్....?"

"నో... యూ ఆర్ నాట్ కరెక్టు....మీ చేతుల్లో ఆపాకెట్ ఏమిటి? కొంపదీసి ఈ రోజు నా పుట్టినరోజనుకుని ఏదైనా ప్రెజెంటేషన్ తెచ్చారేమిటి?"

"అమ్మాయిగారికెంత ఆశో! యిది ఫస్ట్‌పీక్కుదా? తర్వాత డబ్బుంటుందో వుండదోనని....ఒకేసారి ఓ పది సిగరెట్ పాకెట్స్ కొనేశాను...."

"నేనేమీ ఆశపడలేదులెండి.... ఎంతసేపూ సూటిపోటీ మాటల్తో ఏడిపించడం తప్ప మీకు ప్రెజెంటేషన్ తేవటం చాత వుతుందా? ఆశలు పెట్టుకోటానికి నేనేం పిచ్చిదాన్ని కాదు.... సరే గాని స్వీట్ తినండి...."

యిద్దరం స్వీట్ తినటం మొదలెట్టాము.

"మీరలాంటి పిచ్చివాళ్ళనని రుజువుచేస్తే నాకేమిస్తారు?"

"మాటిమాటికీ ఏమిస్తారు. ఏమిస్తారు అని అడుగుతారేం? మీకేంకావాలో చెప్పండి....నాదగ్గరుంటే తప్పకుండా యిచ్చేస్తాను"

"ఊరికే అంటారు.... తీరా అడిగితే పేదొట్టి రౌడీగాడని, సంస్కారహీనుడని.... గొంతు చించుకుంటారు...."

"మీలాగా ఇలా మనసులో ఒకటి పెట్టుకుని బయటికొకటి చెబుతూ కసపెట్టేవాళ్ళకంటే ఆ రౌడీలే నయమనిపిస్తోంది...."—

"నేను మనసులో ఒకటి బయటికొకటి చెబుతున్నానని మీకెలా తెలుసు?"—

"ఎలాగో తెలుసు. ఆ రహస్యాన్ని మీకిప్పుడు చెబుతాననుకోకండి...."

"మొత్తానికి అసలువిషయాన్ని దాటవేశారు.."

"దాటవేసింది నేనుకాదు... మీరే! అడిగిందే పదిసార్లు అడుగుతూ...."

ఇంతలో "అక్కయ్యా! దువ్వెన దొరికిందే.... ఇదిగో మల్లెపూలు...."- అంటూ వాళ్ళ చెల్లెలనుకుంటాను-వచ్చింది

"ఇది మా చెల్లెలు స్రవంతండీ.... టెన్త్ చదువుతోంది- ఈయన మాఆఫీసులో పనిచేస్తారు. విక్రమ్‌కుమార్ ది గ్రేట్! నేను చెబుతుంటానే ఎప్పుడూ పోట్లాడుకుంటామని....? వారేవీరు!"-

"నమస్కారమండి...." అందా అమ్మాయి అచ్చం చైతన్య లాగే వుందాఅమ్మాయి.

"చైతన్య-స్రవంతి.... పేర్లు చక్కగా కలిసిపోయాయి"— అన్నాను.

"మా నాన్నగారు చిన్నప్పుడు ఇంగ్లీషు లిటరేచర్ తె
చదివార్లెండి.... వారికి జేమ్స్‌జాయిస్ అనే రచయితంటే చచ్చేంత
అభిమానంట! ఆయనగారు రాసిన నవలల్లో "స్ట్రీమాఫ్ కాన్షియస్
నెస్" అనే టెక్నికేదో వుండేదిట. ఆ టెక్నికంటే నాన్నగార్కి
పిచ్చి.... ఆ ధోరణిలో నాన్నగారుకూడా కొన్నిరచనలు గిలికారు
లెండి.... ఆ టెక్నిక్‌ను తెలుగులో "చైతన్యస్రవంతి" అంటార్ట-
అందుకని మా పేర్లిలా తగలడ్డాయి.."—

"తగలడటమేమిటి? పేర్లు చాల బావున్నాయి"-

ఇప్పుడు బాగాలేవని నేనన్నానా?"-

"తగలడ్డం అంటే మీ డిక్షనరీలో బావున్నాయనిఅర్థమా?"-

"ఔను. మొదలే చెప్పాను ఇది హెల్ అని! ఇక్కడ
అర్థాలు డిఫరెంట్‌గా వుంటాయి.. ఇదిగో.. స్రవంతి. కాస్త కాఫీ
తెచ్చిపెట్టమ్మా."- అంది చైతన్య.

స్రవంతి వెళ్ళిపోయింది.

"వెధవ దువ్వెన! దీనికోసం అరగంటకుపైగా వెతుకు
తున్నాను. పిల్లిగడ్డిలావున్న ఈ జుట్టు ఈ దువ్వెనకు లొంగు
తుందా? లొంగదు.... అందుకే ఈ జుట్టన్నా ఈ దువ్వెనన్నా నాకు
పరమ అసహ్యం.... చిన్నప్పుడు మా అమ్మ జడవెయ్యటానికి
ఎంత రమ్మన్నా వెళ్లేదాన్నికాదు .... మా అన్నయ్యకులాగా
నాక్కూడా క్రాఫ్‌చేయించమని గోలపెట్టేదాన్ని.... 'ఆడపిల్లవు..
నీకు క్రాఫేమిటి' అని మా అమ్మ తంతుండేది.. ఆడపిల్లలకు
మొగపిల్లలకు ఇలాంటి తేడాలెందుకుంటాయో నాకర్థమయ్యేది
కాదు.... ఒకసారి ఏమయిందోతెల్సా? నాకప్పుడు పన్నెండేళ్ళో
పదమూడేళ్ళో వచ్చుంటాయి., వోణీలు వేసుకోవాలన్నారు.. వెధవ
వోణీలు.... ఆ వోణివేసుకుంటే నావంటిమీద నిల్చేదికాదు. వోణి
సరిగ్గా వేసుకోవాలని మా అమ్మ ఒకటే గోలపెట్టేస్తుండేది... మాటి
మాటికీ వోణీ సర్దుకోవటం నాకు పరమచిరాగ్గావుండేది- అన్నయ్య
లాగ హాయిగా షర్టు - ప్యాంటూ వేసుకుంటానంటే మావాళ్ళు
ససేమిరా ఒప్పుకునేవాళ్ళుకాదు. వెధవసాంప్రదాయం.. గాడిదగుడ్డు
సాంప్రదాయం.. నాకు పిల్లలంటూ పుడ్తే పెంపకంవిషయంలో
ఆడపిల్లలకు మగపిల్లలకు ఎలాంటి తేడా చూపించను. మా

అమ్మాయికి చక్కగా క్రాప్‌చేయించి, ఇరవై ఏళ్ళొచ్చినా షర్టు, బెల్‌బాటమ్స్ వేసి పంపిస్తాను"—

స్రవంతి కాఫీతెచ్చి టేబుల్‌మీద పెట్టేసి వెళ్ళిపోయింది. మాట్లాడుతూ మాట్లాడుతూనే చైతన్య జుట్టంతా దువ్వి దాన్నొక ఆర్డర్లో పెట్టి జడవేసుకుంది. జడవేసుకోగానే ఇంతసేపు చైతన్యలో నేను చూసిన విమాత్నతేదో మాయమయింది.

"మీరు జడవేసుకోకముందే బావున్నారు."-

"మీకేం? మీకళ్ళకి బాగానేవుంటాను. కాని ఆ జుట్టుతో నేనెంత సతమతమైపోతానో మీ కేంతెలుసు....?"-

"సౌందర్యంకోసం ఆమాత్రం కష్టపడలేరా?"

"మీలో ఇంత సౌందర్యదృష్టి వుందని నాకు తెలియదే! మీలో ఈ ప్యూడల్ భావా లెప్పట్నుంచీ....?"

"సౌందర్యాన్ని అన్వేషించడంకూడా ప్యూడల్‌దృష్టే అవుతుందా?"

"అది మీరు చెప్పాలి".

"ఏమిటో.... నా కేమీ చెప్పాలనిపించటంలేదు...."

"ఇదేమిటి! అకస్మాత్తుగా ఇలా మారిపోయారు?"

"ఎలామారిపోయాను?"

"నాకేమీ చెప్పాలన్పించటంలేదు. అని చాలా భావగర్భితంగా తెలుగు సినిమాలో జరువైన సన్నివేశంలో హీరోలాగా మారిపోయారేమిటి?"

"సీకు.... సారీ.... మీకు ప్రతిది వేళాకోళమే.... చాలా లైమయినట్లుంది, వెళ్ళొస్తాను."

"అప్పుడే వెళ్తారా? ఏమీ మాట్లాడనే లేదు."

"మీరా? ఏమీ మాట్లాడలేదా?"

"ఏమో....నా కేమీ మాట్లాడినట్టేలేదు మీకో ఏదో చెబుదామనుకున్నాను."

"ఏం చెబుదామనుకున్నారు?"

"ఏదో చెబుదామనుకున్నానండీ. వెధవబుర్ర.... మరిచిపోయాను. నే నెప్పుడూ ఇంతే....మాట్లాడాలనుకున్నది మాట్లాడకుండా ఏదేదో మాట్లాడేస్తుంటాను.... అఁ.... అఁ.... గుర్తొచ్చిందండీ...."

"ఏమిటది ?" నా గొంతులో ఏదో పిచ్చి ఆతురత....

"ఏమీలేదు.... కొత్తగా జాయినయ్యామే.... మేం నల్గురం ఏదో డిపార్ట్‌మెంటల్ టెస్ట్ పాసుకావాలట.... అది పాసైతేనే మా సర్వీసెస్ రెగ్యులరైజ్ చేస్తార్ట.... ఆ టెస్ట్‌లో ఏమడుగుతార్తో, ఏంపుస్తకాలు చదవాలో, ఏమిటో మిమ్మల్ని అడుగుదామను కున్నాను."

"ఇదా మీరు నాతో మాట్లాడా లనుకున్నది?"

"ఔను...."

"మీ కెందుకండీ ఈ ఉద్యోగం ? ఈ డిపార్ట్‌మెంటల్ టెస్టులు.... హాయిగా ఇంట్లో కూర్చుంటే పోలా ?—

"ఇదా మీరు నా కిచ్చే సలహా ?" -

"ఔను.... మీలాంటివాళ్ళు ఉద్యోగం చెయ్యాల్సిన అవసరం లేదు.... మీ నాన్నగారు పెద్ద ఆఫీసర్... బోల్డు ఆదాయం. రేపెవరో ఆఫీసర్‌కిచ్చి పెళ్ళిచేస్తారు....మీరీ ఉద్యోగం మానేస్తే ఏ పేదవాడికో కడుపునిండా తిండి దొరుకుతుంది.... రేపే రాజీనామా పెట్టేసెయ్యండి " - కొంచెము కటువుగానే అన్నాను.

"అయితే నే నీ ఉద్యోగం చేస్తూ ఓ పేదవాడి కడుపు కొడ్తున్నానంటారు.... అంతేగా ?" -

"ఔను...." -

"మీ రింత చెత్తగా ఆలోచిస్తా రనుకోలేదు...." -

"మీలాంటివాళ్ళకు పేదవాళ్ళనిగురించి ఆలోచించటం చెత్తగానే తోస్తుంది."-

"మీలాంటివాళ్ళకు అనటంలో మీ ఉద్దేశ్యం ఏమిటి ? మేము బాగా బలిసినవాళ్ళం, బూర్జువాలం....కాపిటలిస్టులం.... అనేనా ?"-

"అందులో సందేహం ఏమన్నావుందా ?" -

"అందులో సందేహం ఏమన్నావుందా ?" - వెక్కిరించింది. చైతన్య.

"....ఏమీలేదు.... సందేహం ఏమీలేదు....ఓ ఆడది ఇంత మంది మగవాళ్ళతో సమానంగా ఉద్యోగం చేస్తుందా అన్న మీ మగబుద్ధే మీచేత ఈమాటలు మాట్లాడిస్తోంది అనటంలో సందేహం ఏమీలేదు...."-

"మీతో వాదనను పెంచుకోదల్చుకోలేదు.... వెళ్ళొస్తాను."- దిగ్గున లేచాను.

"మీ సహాయాన్ని కోరటం నాదే బుద్ధితక్కువ. ఇంటి కొచ్చి కడుపునిండా వడ్డించి వెళ్తున్నారు.... చాలా థాంక్స్...."- చైతన్య గొంతు రుద్ధమైపోయింది.... ఆమె కన్నుల్లో నీళ్ళు ఉబికివస్తున్నాయి .. నా కక్కడ మరో క్షణం వుండా లన్పించలేదు. లేచి బయటి కొచ్చేశాను.

బయటికొచ్చాక కొన్ని క్షణాలవరకు నే నేంచేశానో నా కర్థంకాలేదు - ఆమెను మరోసారి ఏడిపించాను.... మా సంభాషణ అలాంటి టర్న్ తీసుకుంటుందని ఊహించుకోలేకపోయాను.

* * * *

ఆ రాత్రంతా ఇద్దరు ముగ్గురు ఫ్రెండ్స్ దగ్గర కెళ్ళి చైతన్య ఇవ్వబోయే డిపార్ట్‌మెంటల్ టెస్ట్‌కు సంబంధించిన యిదివరకటి క్వశ్చన్ పేపర్స్, బుక్స్ సంపాదించాను. రెండు మూడేళ్ళక్రితం నేనుకూడా అలాంటి టెస్ట్ రాశాను. నాదగ్గరకూడా కొన్ని బుక్స్ వున్నాయి. అన్నీకలిపి ప్యాక్‌చేసి తెల్లవారి మా ఆఫీసుకు వెళ్ళగానే ప్యూన్ రాజయ్యను పిల్చి చైతన్య రాగానే ఆ పాకెట్ను ఇవ్వమని చెప్పాను. నా సీటుదగ్గరకెళ్ళి ఏదో పనిచేస్తున్నట్టుగా నటిస్తున్నాను

చైతన్య వచ్చింది. ఆమెను చూడగానే రాజయ్య- "అయ్యగారు మీ కిది ఇవ్వమన్నారు-" అంటూ నే నిచ్చిన పాకెట్ ఆమె కిచ్చాడు

"ఏ అయ్యగారు"- అంది చైతన్య చిరాగ్గా.

"విక్రమ్ సార్...."-

"విక్రమ్‌సారా! ఏమిటిది....?"-అంటూ ఆత్రుతగా పాకెట్ విప్పింది. ఒక్కక్షణం ఆమెముఖం వికసించింది- కాని వెంటనే ముఖం చిట్లించింది.

-"అక్కర్లేదు.... మీ అయ్యగారికే యిచ్చేసెయ్...." అంటూ ఆ పుస్తకాల్ని వాడిమొహాన కొడుతుందా-అనుకున్నాను-కాని చైతన్య అంతపని చెయ్యకపోవటంతో తేలిగ్గా నిట్టూర్చాను.

నన్ను చూసి చూడనట్టే చూస్తూ చైతన్య వెళ్ళి తనసీట్లో కూర్చుంది

"కనీసం థాంక్సయినా చెప్పరా?"- అన్నాను.

"ఎందుకు? నోటికొచ్చినట్టల్లా తిట్టి ఏడిపించినందుకా," అంది చైతన్య

"మీరుకూడా ఏకస్తారని తెలిసి చాలా ఆశ్చర్యపోయాను."-

"మీరుకూడా- అసలు మీ ఉద్దేశ్యం?"-

"ఉద్దేశ్యం ఏమీలేదు. మీరు కొత్త దేరింగా కన్పిస్తారు కదా.... మీ రింత డెలికేట్ అనుకోలేదు...."-

"ఔను.... నేను డెలికేట్ కాదు.... వట్టి బండరాయిని.... నాకు ఫీలింగ్స్ లేవు.... సెంటిమెంట్స్ లేవు.... వట్టి అడవి మనిషిని! ఇప్పటికైనా మీకా విషయాన్ని తెల్సుకున్నందుకు చాలా సంతోషం...."—

"ఇప్పుడు కాదు....ఎప్పుడో తెలుసుకున్నాను...."

"ఔనౌను.... మీ విషయం కూడా నేనెప్పుడో తెలుసుకున్నాను...."

"ఏమని?"

"పట్టి పొగరుబోతు... పోజులరాయుడు అని!"

నేను గట్టిగా నవ్వాను.

"చాలా కరెక్ట్‌గా తెలుసుకున్నారే! మీ దారుణమైన తెలివి తేటల్ని ఎలా ప్రశంసించాలో తెలీటంలేదు.

"తలకిందికి కాళ్ళు మీదికిపెట్టి తపస్సు చెయ్యండి.... తెలుస్తుంది...."

"మీరెప్పుడైనా చేశారా? అంత కాన్ఫిడెంట్‌గాచెబుతున్నారు?"

"ఔను చాలాసార్లు చేశాను.... మీలాంటివాళ్ళకు బుద్ధి చెప్పడం ఎలాగో తెల్సుకోవటానికి...."

"తెలిసిందా?"

"తెలిసింది...."

"అయితే చెప్పండి.... మీలాంటి వాళ్ళచేత బుద్ధిచెప్పించుకోవటం అంటే నాకు చాలా సరదా...."

"ఇదివరకెప్పుడన్నా 'నాలాంటి వాళ్ళచేత చెప్పించుకున్నారేమిటి....అంత సరదాపడుతున్నారు....?"

"ఔను...కాలేజీలో చదివే రోజుల్లో ...."

"చెప్పుదెబ్బలు తిన్నారన్న మాట" చైతన్య గొల్లున నవ్వుతూ— "నేనుకూడా అలాంటిపని చేద్దామనుకున్నాను.... కాపీ ఆఫీసులో పదిమందిముందు ఏంబావుంటుందని.... కొంచెం జంకనకాదాను...." అంది.

"అలా బుద్ధిచెప్పినవాళ్ళు తర్వాతేంచేశారో తెలుసా ?"

"పోలీసురిపోర్టిచ్చి వుంటారు."

"కాదు.... ముద్దులిచ్చారు.... నీవుతప్ప నాకీ లోకంలో ఇంకేమీ అక్కర్లేదని జాగిల్లా నావెంటపడ్డారు ...." అన్నాను కసిగా....

"పోదురూ....ఊదాయి! మీ వెంటపడేంత తలకు మాసిందెవత్తుంటుంది లెండి...."

"తల మాసినవాళ్ళు కాదు....రోజూ తలంటు పోసుకునే వాళ్ళే నావెంట పడేవాళ్ళు...."

నా మాట పూర్తికాకుండానే చైతన్య నాకేసి చాలా తీక్షణంగా చూసింది. అంతటితో మా సంభాషణ ఆగిపోయింది. చివరి మాట నాదే అయినందుకు చాలా సంతోషించాను.

* * * *

చైతన్య డిపార్టుమెంటల్ టెస్టుకు ప్రిపేరవుతోంది. ఆ టెస్టుకు కావల్సిన ఇంకా కొన్ని పుస్తకాల్ని నేనే హైదరాబాద్ స్వయంగా వెళ్ళి తెచ్చిపెట్టాను. హైదరాబాద్ వెళ్ళినప్పుడే ఓ షాపులో, ఆ రోజు చైతన్య అంతగా పొగిడిన సాయికృష్ణ గీత గోవింద ఆధారంతో గీసిన రాధాకృష్ణుల రేఖాచిత్రాలున్న ఆల్బమ్ కన్పిస్తే - వెంటనే కొనేశాను. ఆ ఆల్బమ్ని చైతన్యకు ప్రెజెంట్ చెయ్యాలని నిర్ణయించుకున్నాను - తీసుకుంటుందా? వాట్ని చూడగానే ఉబ్బి తబ్బిబ్బయిపోతుందా? "థాంక్యూ వెరీమచ్" అంటూ నన్ను పెనవేసుకుపోతుందా?

చైతన్యమంది నేనేం ఆశిస్తున్నానో? నాకు తెలుసు....ఆమె నన్ను తన హార్టాఫ్ హార్ట్సులో ఆరాధిస్తోందని.... ఎలా తెలుసు? అది కేవలం నా ఊహా మాత్రమే కావచ్చు.... నేనామెను నా హార్టాఫ్ హార్ట్సులో ఆరాధిస్తున్నాను కాబట్టి ఆమెకూడా నన్ను

... దిన్ని
విష్‌ఫుల్ థింకింగ్ అంటారు. సరే.... ఆమె నన్ను ఆరాధిస్తోంది నా కోసం కలలు కంటోంది. కాని ఆ విషయం ఎప్పుడైనా చెపుతుందా? చెప్పదు. నేను చెప్పానా, "నిన్ను నా హృదయమంతటితో ఆరాధిస్తున్నానని.... చెప్పలేను.... ఇద్దరం కలుసుకున్న మరుక్షణంలో విస్ఫోటాలు.... దెప్పిపొడుచుకోవడాలు.... ఒకర్నొకరు మాటలతో గెలవాలనే వెర్రి ప్రయత్నాలు.... ఆఖరుమాట నాదే కావాలనే పట్టుదలలు.... ఇద్దరిమధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమంటుంది. ఎందుకిలా జరుగుతోంది? ఇద్దరం ఎందుకిలా మమ్మల్ని మేము మోసగించుకుంటున్నాము? ఎందుకిలా ఒకరితో ఒకరం నాటకం ఆడుతున్నాము? ఈ నాటకాన్ని ఆపేసి మా నిజస్వరూపాల్ని చూపించుకోగల్గితే! ఏమవుతుంది? ఏమీకాదు-ఏమీ కాదని నాకు తెలుసు.... అయినా ఎందుకీ దాగుడుమూతలు? ఎందుకీ ఫీలింగ్స్? ఇన్ని ఆశలు! ఇంత కసి! ఇంత ద్వేషం! ఇన్ని మాటలు — ఇన్ని కన్నీళ్ళు - ఇన్ని కలలు.... ఏమీ అవదని తెలిసినా ఎందుకిలా గాలిమేడలు కట్టుకోవటం? మానవ ప్రకృతి చాలా విచిత్రమైంది. ఎప్పుడో అప్పుడు అందరమూ చచ్చిపోతామని తెలుసు.... కాలి పిడికెడు బూడిదగా మారిపోతామని తెలుసు.... అయినా ప్రతీమానవుడిలో ఎన్ని కలలు! ఎంత ఆశ....! ఏదో సాధించాలన్న మొండితనం.... ఎంత పట్టుదల! రేపు చస్తామని తెల్సినా ఇవాళ జీవించటం మానలేం? కలలు కనకుండా వుండలేం.... అశాశ్వతమైన జీవితాన్ని శాశ్వతం చేసుకోవాలన్న మానవుడి నిరంతర పోరాటం సాగుతూనే వుంటుంది. ఆ పోరాటంలోనే ఈ ప్రపంచపు మనుగడ ఇమిడివుంది.

* * * *

హైద్రాబాద్‌కు వెళ్ళి డిపార్టుమెంటల్ టెస్ట్ రాసొచ్చారు ఆఫీసులో కొత్తగా చేరిన అమ్మాయిలంతా

చైతన్య కన్పించగానే "టెస్ట్ ఎలా రాశారు?"- అన్నారు.

ఎలారాస్తే మీకేం? నేను ఫెయిలయితే ఓ పేదవాడికి ఈ ఉద్యోగం దొరుకుతుంది.... అప్పుడే దేశంలోవున్న పేదరికమంతా నిర్మూలించబడ్తుంది. మీరు కోర్కున్నట్టే అవుతుందిలెండి."

వంటావ్ ?" -

"నేను ఫెయిల్‌కావాలని వెంకటేశ్వరస్వామికి మొక్కి వుంటారు. నా లాంగ్‌హేర్ మొత్తం ఇచ్చేస్తానని - నేను ఫెయిలయినా పరేగాని మీరు గుండు చేయించకుంటే ఎంత మచ్చటగా వుంటారో చూడాలని వుందండీ...." - అంది చైతన్య కిలకిలా నవ్వుతూ.

"దీజ్ గ్రాస్ ఇన్‌గ్రాటిట్యూడ్...." - అన్నాను బిగ్గరగా.

"ఎందుకూ ? -

"చేసింది చెప్పటం నా కలవాటు లేదు...."

"ఓహో ! పుస్తకాలు గట్రా తెచ్చిచ్చావంటారు ! వెధవ పుస్తకాలు.... వాటినొక్క సారైనా చదివినపాపాన పోయానా ? టైమే దొరకలేదు రేపు మీ పుస్తకాలన్నీ తెచ్చిస్తానులెండి...." -

"ఏమీ అక్కర్లేదు...."

"ఎందుకు ? -

"ఏ చెత్తకుండీలో నైనా పారెయ్యండి...." -

"ఛ.... ఛ.... ! చెత్తకుండీలో పారేస్తే ఏమొస్తుందండి ? ఏ మిఠాయికొట్టువాడికన్నా అమ్ముకుంటే ఓ రూపాయో, రెండో గిట్టుబాటవుతాయి...."

"ఆ పని చేసినా ఫర్వాలేదు....ఐ హావ్ నో అబ్జక్షన్ ...."

"బట్.... ఐ హావెనాబ్జక్షన్.... వేరే వాళ్ళ పుస్తకాలు నేనెందుకు అమ్ముకుంటాను; రేపు మీకే కట్టగట్టి తెచ్చిస్తాను.... మీరే అమ్ముకోండి."

"ఎక్కడకు తెచ్చిస్తారు ?"

"ఎక్కడకు తెచ్చివ్వమంటారు?"

"మా యింటికి తెచ్చివ్వడం మర్యాద."

"ఓహో! అలాగా....మీ యింటికే తెచ్చిస్తాను.... మీయిల్లెక్కడుంటుందో చెబితే...."

"కుమార్‌పల్లిలో 'ఇద్దరు లేక ముగ్గురు' అన్న ఫామిలీ ప్లానింగ్‌వాళ్ళ పెద్ద బోర్డుంటుంది.... ఆ బోర్డు పక్కనే మాఇల్లు" అన్నాను.

ప్రైవసీ!! ప్లాన్స్ వేస్తాం. ఎంతైనా తెలివైన .... మీలాంటి వాడే. 'అదిగో' చూడండి. అక్కడి వాకిలిదే. అదే మా ఇల్లు బాగా గుర్తు పెట్టుకోండి' అన్నాట్ట. ఈ రోజుల్లో ఎక్కడ చూసినా ఫామిలీ ప్లానింగ్ పక్క బోర్డ్సే.... అందులో మీ యిల్లు ఏ బోర్డు పక్కనున్నవాలి...."

"కరక్టే సుమా! మీరు రేపు సరిగ్గా ఎప్పుడొస్తారో చెప్పండి....'ఇదే మా యిల్లు' అని రాసున్న ఓ పెద్దబోర్డు పట్టుకుని మీకు ఎదురొస్తాను...."

"సరే.... రేపు ఆదివారం కదా.... పదింటికి మీ యింటికొస్తాను"—

"వెరీగుడ్....మీరు పదింటికల్లా గవర్నమెంట్ జూనియర్ కాలేజీ దగ్గరకొచ్చెయ్యండి.... నేనా ప్రాంతాల్లో వుంటాను...."

"బోర్డు పట్టుకునేగా?"

"ఆఫ్కోర్స్...."

* * * *

ఆ తెల్లవారి చైతన్య మా యింటి కొచ్చేసింది.

వీధుల్లో ఆమెపక్కన నడుస్తుంటే ఎందుకో గర్వంగా ఫీలయ్యాను. చైతన్య ఏదో మాట్లాడుతూనే వుంది. హైదరాబాద్లో తను రాసిన టెస్ట్ను గూర్చి చెప్తోంది.... ఏమేం అడిగారో. తను వాటికి సమాధానా లెలా రాసిందో చెప్తోంది.... కాని నేనామె మాటల్ని వినటంలేదు.... చైతన్య మొదటిసారి మా యింటి కొస్తోంది. మా యింటిని చూసి ఏమనుకుంటుంది? షాకవుతుందా? అసలు చైతన్యను మా యింటికి రమ్మని ఎందుకు పిలిచాను? పిలవకుంటానే ఆమెతో ఎప్పటిలాగే కొంతకాలం దాగుడుమూతలు ఆడుకుంటూ గడపటంలోనే ఆనందం వుందేమో....

మా యింటి ముందుకు రాగానే.... "ఇదే మీ యిల్లు! యామై కరక్ట్?" – అంది చైతన్య ఉత్సాహంగా.

"అరె.... ఎలా తెల్సుకున్నారు?" – పరధ్యానంగా వున్న నాకు ఆమె మా యింటిని ఎలా తెల్సుకుందో బోధపడలేదు –

చైతన్య పకపకా నవ్వింది –

"ఇద్దరు లేక ముగ్గురు.... మరచిపోయారా?" – అంటూ మా యింటి పక్కనే వున్న బోర్డును చూపించింది –

"ఓ! అవా....!" - అన్నాను.

"రండి రండి....ఈ పేదవాడి ఇంటిని పావనం చెయ్యండి." అంటూ లోపలకు దారి తీశాను

"మాది మూడు రూములు వరుసగా రైలుడబ్బాల్లాగా ఒక దాని వెంట ఒకటి వుండే పోర్షన్. మీ యింట్లోలాగ మా యింట్లో మల్లెపూలు, నైట్‌క్వీన్లు వుండవు.... కనీసం కూర్చోటానికి కుర్చీలుకూడా లేవు."-

"కొంపదీసి 'కూర్చుండ మాయింట కుర్చీలులేవు.... నా ప్రణయాంకమే సిద్ధపరుచనుంటి....' అంటారా ఏమిటి. కరుణశ్రీ లాగా....? కుర్చీలేం అక్కర్లేదు.... హాయిగా ఇలా ఈ చాపమీద కూర్చుంటానులెండి. ఇవిగో మీ పుస్తకాలు. ఇప్పుడివ్వమ్మంగా..?"-

ఆమెఇచ్చిన పుస్తకాలు గదిలో ఓమూల పడేశాను. 'మీ యింటికొచ్చిన రోజు నా చేతిలోవున్న పాకెట్ చూసి నాకేమైనా ప్రెజెంటేషన్ తెచ్చారా అని అడిగారు. ఈ రోజు ఈ ప్రెజెంటేషన్ ఇస్తున్నాను స్వీకరిస్తారా?"

హైదరాబాద్‌నుండి తెచ్చిన గీతగోవింద రేఖాచిత్రాలు ఆల్బమ్ చైతన్యకిచ్చాను.

"వ్వావ్! గీతగోవింద రేఖాచిత్రాలే! సాయికృష్ణ్ణ్ణచేసిన వేనా? హౌ వండర్‌ఫుల్! హౌ మార్వెలస్... థాంక్యూ విక్రమ.... థాంక్యూ వెరీమచ్...."-

అంది చైతన్య పరవశంతో తనను తాను మరచిపోయి.

పరవాలేదు... మీతో కనీసం ఈసారైనా థాంక్స్ చెప్పించు కున్నాను."-

మరుక్షణంలో ఆమె పూర్వపు చైతన్యగా మారిపోయింది.

"అయినా ఈ ప్యూడల్ ఆర్టు మీకెలా నచ్చింది?"- అంది

"మీకు నచ్చిందిగా?"

"ఇదేమిటి....ఇక్కడేదో రాశారు.... కవిత్వమా? మీరు కవిత్వంకూడా రాస్తారన్నమాట!" -

ఆ ఆల్బమ్‌కి ముందు నేను కొన్నిలైన్లు రాయకుండావుండ లేకపోయాను.... ఆమె ఆ చరణాలను చదువుతోంటే నా గుండెలు వణికాయి.

చైతన్యకు :

"నిఘంటువుల్లోని పదాలుకూడా
నీచెలిమి విలువను చాటలేవు
నింగీ, నేలా రెండు కావిలి
మనమైత్రి వయస్సును దాటలేవు.
జలజలా ప్రవహించే సెలయేటి సవ్విల్లాలాగా
మొలకెత్తిన లేతపచ్చిక అంచుల్లాగా
శీతాకాలపు చిరుమబ్బుల చల్లదనంలాగా
జీవనానుభవపు తీయని వేళలాగా
ప్రపంచాధిపత్యానికి సంబంధించిన
సౌవర్ణ సింహాసనాన్ని తృణీకరిస్తూ
నీస్నేహం-దిగంతాల నీకల్లోకి ఊడల్ని దిగేసింది
నీస్నేహం-నిజంగా నేను జీవించాల్సినఅవసరాన్నిచాటింది.
నా మరణానికి అసలు కారణాన్ని చూపింది।
నిజం - నిక్కంగా - నీ జ్ఞాపకాలే ...
హృద్వారను అక్షువుల్లోకి అనువదించగలవు
మన స్నేహానికి చిహ్నంగా
ఈ చిత్రాలు- స్వీకరిస్తావు కదూ।

—విక్రమ్‌కుమార్....

చదవడం పూర్తిచేసి చైతన్య నాకేసి చూసింది. 'మీకు కవిత్వం ఇంతబాగా రాస్తారని తెలీదే.... దీన్ని యేం కవిత్వమంటారు.... ఫ్యూడల్ కవిత్వమా, అభ్యుదయ కవిత్వమా- విప్లవ కవిత్వమా'

"ప్లీజ్ చైతన్యా!"- అన్నాను బాధగా

"ఏమిటి? అకస్మాత్తుగా అంతసీరియస్ అయిపోయారు"

"బాసు....సీరియస్సే.... నేను రాసిన ఆ మాటల్ని ఎంత సీరియస్‌గా రాశానో ఆమెకు తెలీదు— ఆమె కాస్సేపు మాట్లాడ్డం మానేసి ఆల్బమ్ తిరగేస్తోంది. కొన్ని క్షణాలసేపు మామధ్య నిశ్శబ్దం...."

"లోపలున్నాంది "నాన్నా! అమ్మ రమ్మంటోంది" అంటూ మా రవి వచ్చాడు ఆల్బమ్‌లోంచి చైతన్యతలెత్తి రవిని చూసింది.

"ఎవరీ అబ్బాయి?" అంది.

"ఎవరో చెప్పండి.... చూద్దాం!" అన్నాను ఆమె ముఖ కవళికల్ని పరీక్షిస్తూ....సరిగ్గా ఈ క్షణంలోనే చైతన్య ఎలా మారుతుందో చూడాలనే ఆమెను మా యింటికి పిలవాలని చాలా సార్లు అనుకున్నాను.

ఒక్క క్షణం పేపరు రవిని తేరిపార చూసి:

"మీ సుపుత్రుడేనా?" అంది ఎంతో మామూలుగా....

"ఔను ....ఎలా తెలుసుకున్నారు?"

"మీ ముఖం ఆ కుర్రాడిముఖం చూస్తే నేనేకాదు....ఇప్పుడే కళ్ళు తెరచిన పసిపాప కూడా ఆ కుర్రాడు మీ సుపుత్రుడని చెప్పేస్తాడు"

"మా ఆవిడను పరిచయం చేయ్యమంటారా?" అన్నాను నాకు పెళ్ళయింది- పిల్లలు కూడా వున్నారని తెలిసినప్పుడు ఆమె ఎంతో షాకై పోతుందనుకున్నాను....కాని....అలాంటిదేమీ కనిపించలేదు.... ఆమె నిర్వికారంగా నేనిచ్చిన ఆల్బమ్ చూస్తోంది.

"పరిచయం చెయ్యమంటారా అని నా పర్మిషన్ తీసుకుని గానీ పరిచయం చెయ్యరా ఏమిటి?"- అంది చైతన్య.

"మా ఆవిడ అంతగా చదువుకోలేదు.. పట్టి పత్తికాలం.... ఇంటికొచ్చిన కొత్తవాళ్ళతో శాస్త్ర సంస్కారంగా మాట్లాడటం కూడా తెలీదు."

"మీరు చదువుకున్నారుగా.... మీరు చదువుచెప్పొచ్చుగా... మీలోని సంస్కారాన్ని ఆవిడకూడా కొంచెం ఇవ్వొచ్చుగా...."-

"నేనూ యిలాగే చాలాసార్లు అనుకుంటాను కానీ టైమ్ దొరకదు ఆమెకు పని తీరదు. ఇంట్లో ఎప్పుడూ పిల్లలతో, వంటతో సరిపోతుంది."-

"ఔను.... ఆడవాళ్ళను పిల్లలను, వంటింటికి అంకితం చెయ్యకుండా మీ మగవాళ్ళు వాళ్ళనేదో ఉద్ధరిస్తారని ఎవరను కుంటార్లెండి.... బయటికొచ్చి ఉపన్యాసాలివ్వమంటె ఇస్తారు.... ఎంతమంది పిల్లలేమిటి?"-

"ఇంటిముందే వుందిగదా బోర్డు! ఇద్దరు లేక ముగ్గురు.... మాకిద్దరే...."-

"ఫరవాలేదు.... అలాగైనా కొంత ఉద్ధరించారు.... మీవాడి పేరేమిటి"-

"రవి...."-

"ఏం చదువుతున్నావు రవీ!"- అంది రవినుద్దేశించి.

"ఒకటోతరగతి...."- అన్నాడు వాడు.

"కూర్చోండి.... ఇప్పుడేవస్తాను."-

లోపలికెళ్ళాను. కాఫీ తీసుకుని తననే ముందురూంలోకి రమ్మని మా ఆవిడకు చెప్పి నేనొచ్చాను.

కాస్సేపట్లో సరళ కాఫీతీసుకుని ముందుగదిలోకొచ్చింది. వాళ్ళు చైతన్యకు చెరో కాఫీకప్పు అందించింది.

"సరళ.... మా శ్రీమతి -" పరిచయంచేశాను.

"నమస్కారమండి"- అంది సరళ రెండుచేతులు జోడించి....

"ఈమెపేరు చైతన్య. మా ఆఫీసులో పనిచేస్తుంది." అన్నాను చైతన్యను పరిచయంచేస్తూ —

"వారు మీ గురించి చాలాసార్లు చెప్పారండి" అంది సరళ.

"ఏమని చెప్పారు? ఎప్పుడూ వసపిట్టలా వాగుతుందని చెప్పారా?" అంది చైతన్య.

"అలా చెప్పలేదనుకోండి...." అంటూ సరళ ఇంకేదో చెప్పబోయింది.

"పాప ఏడుస్తున్నట్టుంది.... నువ్వు లోపలికెళ్ళు సరళా!" అన్నాను.

"సరళ వెంటనే లోపలికెళ్ళిపోయింది."

"అదేంటి? ఆవిడేదో చెప్పబోతోంటే అలా లోపలికి పంపిస్తారేమిటి? ఏమో అనుకున్నాను. మీరూ అందరిలాంటి మగ వాళ్ళే...."

"అంటే?"

"ఆడదానిమీద పెత్తనం చెలాయించేవాళ్ళే.... భార్యంటే ఇక్కిన పేనులా పడుండాలి అన్న మనస్తత్వం కలిగినవాళ్ళే.... ఐ రియల్లీ.... హేట్ దిస్ మేల్ డామినేషన్...."

"అలాగే హేట్ చేద్దురుగాని.... కాఫీ తాగండి.... చల్లారి పోతుంది."

"చల్లారిన కాఫీ అంటేనే నా కిష్టమని మీ కెప్పుడో చెప్పినట్టుగుర్తు."

"ఔను.... మరచిపోయాను."

చైతన్య ఆల్బమ్ తిరగేస్తూ కాఫీ సిప్ చేస్తోంది.

"ఓ విషయం అడుగుతాను దొంక తిరుగుడు లేకుండా నిజం చెబుతారా?"

"అంటే మీ ఉద్దేశం నేనెప్పుడూ దొంకతిరుగుడుగా చెబుతాననా?"

"ఔను.... దొంకతిరుగుడు లేకుండా ఎప్పుడైనా జవాబుచెబుతారా?"

"అయితే ఇప్పుడుకూడా దొంక తిరుగుడుగానే చెబుతాను. అడగండి.... ఏమడుగుతారో...."

"సూటిగా నిజం చెబుతావంటే అడుగుతాను...."-

"అలా చెప్పటం నాకు చేతకాదని మీరే చెప్పారుగా? నాకు చేతకానివని చెయ్యమంటే నేనెలా చెయ్యగలను?" అయినా, మీరేం అడుగుతారో నాకు తెలుసులెండి...."-

"ఏది చెప్పు చూద్దాం...."-

"తీరా చెప్పాక అదికాదని బుకాయించటానికా? నాచేతే మొదట చెప్పిద్దామని ప్రయత్నిస్తున్నారు.... నేను చెప్పను మీరేచెప్పండి"-

"నాకు పెళ్ళయిందని.... పిల్లలున్నారని తెలిసినప్పుడు నువ్వు షాకయిపోలేదూ?"

ఈమధ్యనే నే నామెను ఏకవచనంలో సంబోధిస్తున్నాను

"నేను షాకయిపోతానని మీ కెందుకనుకున్నారు?"-

"అదిగో.... ఆ దొంక తిరుగుడే వద్దన్నాను...."-

"ఆ దొంకతిరుగుడే నా తత్వమని నేనుకూడా అన్నాను చెప్పండి.... నేను షాకయిపోతానని మీ కెందుకనుకున్నారు?"-

"ఎందుకో అనుకున్నాను.... కొన్ని అనుకోవడానికి కారణాల్ని వివరించి చెప్పలేం.... సింప్లీ ఐ ఫీల్ లైక్ దట్...."-

"సింప్లీ ఐ ఫీల్ లైక్ దట్ట! గాడిదగుడ్డు కదూ? దానికీ కారణం వుండి తీరుతుంది..."-

"పోనీయ్.... మీరేచెప్పండి.... నేనలా ఎందుకు ఫీలయ్యాను."

"ఎందుకు ఫీలయ్యారా? నేనేదో మిమ్మల్ని ప్రేమించేశానని, మీకు తప్ప నాకు మరోలోకంలేదని మిమ్మల్నే పెళ్ళాడాలని కలలు కంటున్నానని.... మీరు కలలుగన్నారు పాపం....

...ల్లు.... యిప్పుడు పెళ్ళయింది, పిల్లలున్నారూ అని తెలీగానే - 'అయ్యో, అయ్యో.... మీకు పెళ్ళయిందా? ఎంత మోసం....ఎంత దారుణం.... నా బ్రతుకిప్పుడేం కావాలి.... మీరే సర్వస్వమని నమ్మానే.... వచ్చినప్పుడు నట్టేట్లో ముంచేమంటారా' అని తెలుగు సినిమా హీరోయిన్లాగా ఓ పెద్ద బరువైన డైలాగ్ అప్పచెబుతాననుకున్నారు.... ఔనా?" -

"మీ ఫ్రెండ్ షేస్తారెవరో మీకేదో కాంప్లిమెంటిచ్చారన్నారు చూడండి....అతనొక్కడే మిమ్మల్ని కరక్టుగా అర్థం చేసుకున్నాడు" అన్నాను, అంతకంటే ఏమనాలో తెలీక.

"ఏమిటా కాంప్లిమెంట్?"

"మీరు అవులించకుండానే పేగుల్లెక్కపెడ్తారని...."

చైతన్య గలగలా నవ్వింది — మరుక్షణంలో సీరియస్‌గా మారిపోయింది.

"అంత రాక్షసినంటారు!"

"ఎంత రాక్షసి"

"అవులించకుండానే పేగులులెక్కబెట్టేంత రాక్షసినన్నమాట!"

"ఆ మాట మీరే గొప్పగా చెప్పుకున్నారుగా?"

"గొప్పగా ఏం చెప్పుకోలేదు....ఒకాయన ఇలా అన్నారని చెప్పాను....అది సరే....నేనిక వెళ్తాను.... మా ఉమ ఈ రోజు మార్నింగ్ షోకి వెళదామంది....ఈ పాటికది మా యింటికొచ్చేసి వుంటుంది...."

"ఏ పిక్చర్ కెళ్తున్నారు?"

"ఏదో పిక్చర్"

"మీరు ప్రతిపిక్చర్ వదలకుండా చూసేట్టున్నారే."

"ఔను....ప్రతిఅర్థమైన సినిమా చూస్తాను.... నాలాంటి సినిమా పోషకులున్నారు కాబట్టే....తెలుగు సినిమా పరిశ్రమ బ్రతుకుతోంది. మీలాగ అందరూ కళాఖండాలు, తప్ప కళామొండాలు చూడని వాళ్ళే అయితే తెలుగు సినిమా పరిశ్రమ ఈ పాటికి చచ్చిఊరుకునేది...."

"చైతన్యలేచి బైటికి నడిచింది. ఆమెతోపాటు నేనూ— ఇద్దరం నడుస్తున్నాము.

"మీతోపాటు నేనూ మార్నింగ్ షోకొస్తాను ఏనీ అబ్జెక్షన్"
"నో అబ్జెక్షన్....శేషగ్గా రావచ్చు...."
"చూపిస్తారా?"
"ఏం? మీకు సినిమా చూపటం రాదా?"
"రాదు...."
"పాపం....పసిపిల్లాడు.... ఇప్పుడే కళ్ళు తెరిచాడు.... నేను వెళ్ళిపోతాను....మీరింక వెళ్ళొచ్చు...."
"మీతో నేనిలా నడవటం మీకు బాగాలేదా?"
"చాలాబావుంది కాని మాఇంటిదాకావస్తే యింకాబావుంటుంది"
"మళ్ళీ మీరు మాయింటిదాకా వస్తానంటే నేను మీ యింటి దాకా వస్తాను"-
"ఆతర్వాత మీరు మళ్ళీ మాయింటిదాకా వస్తానంటే నేను మీయింటిదాకా వస్తాను...."-
ఇద్దరమూ నవ్వుకున్నాము.
"నేను వెళ్తాను మరి...."- అన్నాను.
"ఏసినిమాకొస్తామన్నారు?"-
"మీరు కరెక్టుగా ఏ సినిమాకెళ్తున్నారోకూడా చెప్పలేదుగా...."-
"అలంకార్‌లో ఏదో.... "క్రేజీబోయ్స్" అన్న పిక్చర్ వుంది చాలాఫన్నీగావుంటుందని చెప్పారు ఫ్రెండ్స్....వస్తారా?"-
"ఎన్నింటికి?"-
"11-30 కనుకుంటాను,"-
"వస్తాను...."-
చైతన్యను వీధి చివరిదాకా పంపించి నేను వెనక్కి వచ్చాను. -రియల్లీ ఫన్నీగరల్, తన ఎమోషన్స్‌ని ఎప్పుడూ చూపించదు. నాకు పెళ్ళయింది- పిల్లలున్నారని తెలిశాక నాపట్ల ఆమెప్రవర్తన మారుతుందనుకున్నాను. కానీ అలాంటిదేమీ కన్పించకపోవటం నన్నింకా ఆమె కెంతోదగ్గరగా చేర్చింది.
ఇంటికిరాగానే ఆమె రిటర్న్‌చేసిన బుక్స్ పాకెట్‌ని ఒకసారి విప్పిచూడాలన్పించింది.... అందులో ఎక్కడైనా తప్పకుండా ఏదన్నా రాసిపెట్టుంటుందన్న ఏదో ఆశ.
ఆ పాకెట్ విప్పగానే ఆమె అందమైన లెటర్‌ప్యాడ్‌మీద

ముత్యాల్లాంటి అక్షరాల్లో చేతవ్రాసిన ఆ పంక్తులు ప్రత్యక్షమయ్యాయి నా గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

"నన్ను కృతఘ్నురాల్ని అన్నావు,
ఔను.... ఆమాట నిజమే!
నీకు నేనేమివ్వగలనని?
జీవనపథంలో పడిలేస్తున్న పథికురాల్ని
ప్రేమానురాగాల బాటన పేచతీర్చావు!
నీకు నేనేమివ్వగలనని,
హృదంతరాళాల్లోంచి
కంఠనాళాలు పెగుల్చుకుని పిలిచే
"మిత్రమా! ఉన్న పిలుపు తప్ప.
ఒంటరితనం ఓడించినప్పుడు
తుంటరికోరికలా ఎద తొలిచినప్పుడు
అర్థంకాని ఆవేదనతో అలమటిస్తూ
నిబిడ నిశీధిలో దేనికోసమో దేవులాడుతుంటే
వెలుగురేఖవై విచ్చుకొచ్చావు
నీకు నేనేమివ్వగలనని,
ఆ వెలుగులో నా ఉనికిని వెతుక్కోవటంతప్ప
అనురాగం, అభిమానం, చనువు లాలన
అన్నీ పొదిగిన అపురూప బాంధవ్యం నేర్పావు.
నీకు నేనేమివ్వగలనని,
హృదయ స్పందనలతో సమంగా నీ పేరు స్మరించటంతప్ప!"

..మళ్ళీ చదివాను... మళ్ళీచదివాను....ఎన్నోసార్లు.... ఎన్నిసార్లు-చదివానో! ఎన్నిసార్లు చదివినా ఈ గుండె నిండదు ఎన్నిసార్లు చదివినా ఈ దాహం తీరదు.... ఎన్నిసార్లు చదివినా.... ఈ ఎద లోపలి రొద సమసిపోదు!

## 2

అతన్ని చూడగానే "ఈయన గొప్ప 'పోటాలరాయుడల్లే వుందే' అన్నభావం కల్గుతుంది.

పోటాలరాయుళ్ళను చూస్తే నాకు ఒళ్ళు మండుతుంది. వాళ్ళతో గిల్లికయ్యం పెట్టుకోవా లనిపిస్తుంది.

వచ్చాను. అతడూ మా సెక్షన్లోనే పనిచేస్తాడు పేరు విక్రమ్‌కుమార్.

ఒక్కసారిచూస్తే మరచిపోలేని రూపం విక్రమ్‌ది— ఎప్పుడూ మల్లెపువ్వులాంటి తెల్లటిబట్టలు ధరిస్తాడు. మా సుల్తానా అతనికి 'టినోపాల్' అన్న నిక్‌నేమ్ తగిలించింది. ఎప్పుడూ ఆ బట్టల్ని అంత తెల్లగా యెలా వుంచుకోగల్గుతాడో ఊహించలేక పోయేదాన్ని. ప్యాంటుమీదగాని షర్టుమీదగాని యే చిన్న మరక పడినా చిరాగ్గా ముఖంపెట్టి దాన్ని దులిపేసేదాకా వదిలేవాడుకాదు. ఎప్పుడూ ఇన్‌షర్టువేసేవాడు ఇన్‌షర్టు అనేది ఈయనగారికోసమే పుట్టిందా' అన్పించేది అతన్ని అలా ఇన్‌షర్టులో చూసినప్పుడల్లా

నల్లని తుమ్మెదరెక్కల్లాంటి భుజాలదాకా వ్రేలాడే లాంగ్ హేర్‌ను చూసినప్పుడల్లా 'ఇన్ని వెంట్రుకల్ని యితడెలా భరిస్తున్నాడురా బాబూ' అన్పించేది, వెనకజన్మలో ఈయన ఆడదై పుట్టివుంటాడు - అనుకునేదాన్ని - అన్ని వెంట్రుకలకి మానె పట్టించటానికి, దువ్వి వాటినొక ఆర్డర్లో పెట్టటానికి రోజూ ఈయనగార్కి యెంతటైమ్ పడ్తుందో! ఆడదాన్నైనప్పటికీ నాకు నా వెంట్రుకలంటే పరమ చిరాకు హాయిగా మగపిల్లాడిలా - అయినా, యీ రోజుల్లో 'మగపిల్లాడిలా' అని అనకూడదేమో.... ఆడవాళ్ళకంటే వాళ్ళే యెక్కువ హేర్ పెంచేస్తున్నారు - క్రాపింగ్ చేయించుకుంటే ఈపీడ వదిలిపోయేదిరా బాబూ అన్పించేది కాని ఏ మాటకామాట చెప్పుకోవాలి- లాంగ్‌హేర్ విక్రమ్ రూపానికొక వినూత్నమైన సొగసును సమకూర్చింది.

కాటుక పెట్టుకున్నాడా అన్నట్టుగా వుండే అతనికళ్ళల్లో ఏదోగర్వం.... ఎదుటివాడిపట్ల ఏదో తిరస్కారభావం.... తన మీద తనకు యెనలేని ఆత్మవిశ్వాసం కొట్టవచ్చినట్టు కనిపించేది.

విశాలమైన నుదురు, దట్టంగా వ్యాపించిన కనుబొమ్మలు, నిటారుగా సాగిన పొడవైన ముక్కు. సన్నని మీసకట్టు దోస చెక్కల్లాంటి పెదవులు - ఏ గ్రీకు శిల్పాన్నో చూసినట్టుగావుండేది అతన్ని చూడటం తను అందంగా వుంటానని. తనలాంటి అందగాళ్ళు చాలా అరుదుగా వుంటారని అతనికి తెలుసు - అతను తన చుట్టూవున్నవాళ్ళను చూసే చూపుల్లో ఇది స్పష్టంగా కనిపించేది.

వేళ్ళతో సిగరెట్ పట్టుకోవటం సిగరెట్‌ను పెదవులతో పట్టుకుని వ్రేళ్ళను వదిలెయ్యటం, పొగపీల్చి వదలటం-ప్రతిదాంట్లో పోజే! యే రాజేష్‌ఖన్నాకో, అమితాబ్‌బచ్చన్‌కో వున్నంత పోజు విక్రమ్‌కుండేది

విక్రమ్ మాట్లాడితే చాలు — ఈ ప్రపంచంలో నేనొక్కణ్ణే తెలివైనవాణ్ణి - మిగతావాళ్ళంతా ఫూల్స్ - అన్నట్టుగా వుండేది అతనిలో నాకు బొత్తిగా నచ్చని గుణం ఇదే! అతడు మాట్లాడితే చాలు నాకు ఒళ్ళు మండిపోయేది. "నీకంటె తెలివిగా మాట్లాడగలను" అని రుజువు చెయ్యాలన్న ప్రేరణను ఆపుకోలేక పోయేదాన్ని. అందుకే అతని ప్రతిమాటకు అడ్డుపుల్ల వేసేదాన్ని- అతడు ఒకటంటే నాకు రెండు అనాలని అన్పించేది అన్పించటమే కాదు. అనేసేదాన్నికూడా. అందరు ఆడవాళ్ళలాగా అణిగిమణిగి వుండటం నా ఇంటా వంటా లేదు. అసలు ఆడపిల్లలవ్వటం మాత్రాన అణిగిమణిగి వుండాలని ఎందుకనుకోవాలో నా కర్థమయ్యేదికాదు. కాలేజిలో చదివే రోజుల్లో నా ఫ్రెండ్స్‌తో ఈ విషయంలో గంటలగ్గంటలు వాదించేదాన్ని. బోయ్స్ మమ్మల్ని అప్పుడప్పుడు ఏదన్నా అనేవాళ్ళు. నేను వెంటనే జవాబు చెప్పేదాన్ని. "అలా జవాబుచెప్తే వాళ్ళింకా రెచ్చిపోతారే - వాళ్ళు అనే మాటలన్నీ మనం విననివినట్టు నటిస్తూ తలొంచుకుని క్లాసుకెళ్ళి రావటమే మనం చెయ్యాల్సిన పని" అంటూండేది మా క్లాస్‌మేట్ విజయ.

"రెచ్చిపోనీయవే.... వాళ్ళు రెచ్చిపోతే మనం రెచ్చిపోదాం.... వాడు ఒకటంటే నేను రెండంటాను. ఏంచేస్తాడో చూద్దాం!" అనేదాన్ని.

"ఎంతైనా మనం ఆడవాళ్ళమే. అరిటాకువెళ్ళి ముల్లుమీద పడ్డా ముల్లువచ్చి అరిటాకుమీదపడ్డా అరిటాకుకే ప్రమాదం.... ఆడబ్రతుకంటే అరిటాకులాంటిది" అంది విజయ.

"అరిటాకా? గాడిదగుడ్డా! కట్టిపెట్టవే నీ అమ్మమ్మ కబుర్లు. మనం ఆడవాళ్ళం. ఎవరేమన్నా నోరు మెదపకుండా తలొంచుకుని

పించాలి. అనుకుంటున్నారేమో [illegible] మనం తెగించామో - ఒక్కటికి రెండన్నామో - ఈ హీరోలంతా జీరోలై పోతారు" అనేదాన్ని.

నా మాటల్ని చేతల్లో కూడా చూపించేదాన్ని. చాలా త్వరలోనే నాకు కాలేజీలో ఈ అమ్మాయి 'డేర్ డెవిల్' అన్న ఇమేజ్ ఏర్పడింది. నా జోలికి రావటానికి మా కాలేజీ హీరోలు భయపడేవాళ్ళు అలాంటిదాన్ని నేనీ విక్రమ్‌కుమార్‌కు భయపడ్తానా?

అసలు ఈ విక్రమ్ నా జీవితంలో ప్రవేశించటం చాలా విచిత్రంగా జరిగింది నేనీ ఆఫీసులో ఎల్. డి. సి. గా జాయిన్ కావటమే నా జీవితంలో ఓ పెద్దబ్లండర్.

కాలేజీలో చదువుకునే రోజుల్లో నేనో డాక్టర్ని కావాలని కలలుకనేదాన్ని.... మా నాన్నగారు నన్ను ఎంతడబ్బయినా పెట్టి డాక్టర్‌కోర్సు చదివిస్తానన్నారు- నన్ను చాలా ప్రోత్సహించారు కూడా.... కాని నాదే మొద్దుబుర్ర! గంటలతరబడి అదేపనిగా మాట్లాడమంటే మాట్లాడగలను.... ఎదుటి వ్యక్తిని మాటల్తో చిత్తు చెయ్యమంటే చేస్తాను. కాని.... కాస్త స్థిమితంగా కూర్చుని టెక్స్టు బుక్సు చదవమంటే మాత్రం చేతనయ్యేదికాదు

అసలు నన్ను డాక్టర్ని కాకుండా చేసింది నా మొద్దుబుర్ర కూడకాదు. నాకు చాలా చిన్నవయస్సులోనే వారపత్రికలు, సినిమా పత్రికలు, మాసపత్రికలు మొదలైనవి చదవటమంటే ఒక వల్లమాలిన అభిమానం ఏర్పడింది. మా యింట్లో ఎక్కడచూసినా ఇవే వుండేవి- వాటితో పాటు నవలలు చదవడంకూడా నేర్చుకున్నాను. ఎంతసేపూ ఈ పత్రికలు, నవలలు చదవడం, ఊళ్ళోకొచ్చిన ప్రతిసినిమా చూసెయ్యటం. ఫ్రెండ్స్‌తో గంటలగ్గంటలు కబుర్లు చెప్పటం- నా కాలేజీ లైఫంతా ఇలా గడిచిపోయింది- టెక్స్టు బుక్సు చదవాలంటే ఆముదం తాగమన్నట్టుగా ఫీలయ్యేదాన్ని. మా నాన్నగారు ఎప్పుడూ అంటూ ఉండేవారు-"ఈ నవలల పిచ్చిలోపడి నువ్వు పాడైపోతున్నావే.... నిన్ను డాక్టర్ని చెయ్యాలని కలలు కంటున్నాను.... నువ్వు డాక్టరువుకావుకదా.... కనీసం కాంపౌండరువుకూడా అయ్యేట్టు లేవు...."

"పోనీండి నాన్నారూ.... బోడిడాక్టర్.... ఈ పుస్తకాల్లో

[illegible] అన్నా.

అలా అనటంవరకే- ఒకపక్క తెగ బాధపడిపోయేదాన్ని, డాక్టర్ ప్రొఫెషన్‌మీద నా కెందుకో విపరీతమైన మోజుండేది- వెధవది- పద్ధతిలో ఈ ఎంట్రెన్స్ పరీక్షల్లేకుండా చక్కగా వెళ్ళి డాక్టరుకోర్సులో పడిపోతే బాగుండును అని కలలు కనేదాన్ని.

మనం కన్న కలలన్నీ నిజమవుతాయా? మా నాన్నగా రన్నట్టు నేను డాక్టర్నుకాదు గదా, కనీసం కాంపౌండర్‌నికూడా కాలేకపోయాను. అతికష్టంగా బి ఎస్. సి గట్టెక్కి యింట్లో కూర్చున్నాను.. కనీసం ఎం. ఎస్. సి. అయినా ఏదుస్తావా?"— అన్నారు నాన్నగారు

నవ్వుతూ "ఎందుకులెండి నాన్నా, ఇంట్లోకూర్చొని నవలలు చదువుకుంటాను"- అన్నాను.

"ఇన్ని నవలలు చదివావుకదా! నువ్వూ ఓ నవల రాయ కూడదూ .... మా వాడొకడు ఏదో మాసపత్రిక పెట్టాడు - వాడి పత్రికలో అచ్చేయిస్తాను-" అన్నారు నాన్నగారు

"ప్రస్తుతం ఆ ప్రయత్నంలోనే వున్నాను నాన్నగారూ."- అన్నాను. అన్నానేగాని అంత పిచ్చిప్రయత్నం నేనెన్నడూ చెయ్య లేదుగాని.... ఒకరోజు నాతోపాటు బి ఎస్ సి. చదివిన ఇద్ద రమ్మాయిలు ఎంప్లాయ్‌మెంటు ఎక్స్చేంజి కెళ్తోంటే నేనూ వెళ్ళి నా పేరును కూడా రిజిష్టర్ చేయించివచ్చాను.

"ఉద్యోగం వస్తే చేస్తావా?"- అన్నారా అమ్మాయిలు.

"ఉద్యోగం వస్తుందా, ఛస్తుందా! ఈ ఎంప్లాయిమెంటువాడు మనకి కాల్ పంపించేనాటికి మనం అమ్మమ్మలమైపోతాము"-అన్నాను,

కాని ఎంప్లాయ్‌మెంటు కార్డుని రెండు మూడుసార్లు రెన్యూ చేయించానో లేదో- ఓరోజు ఆర్. టి. సి. లో ఏవో జాబ్స్ వున్నాయని ఫలానా రోజు ఆర్. టి. సి. ఆఫీసులో ఇంటర్వ్యూ వుంటుందని, అటెండ్ చెయ్యాల్సిందని కాల్ వచ్చింది.

"ఏదో తుసుపోకకు పంపించాడులే. ఈ ఉద్యోగం వస్తుందా చస్తుందా-" అనుకున్నను- అసలు ఇంటర్వ్యూకే వెళ్ళా ద్దనుకున్నాను.

"వా డెలాగూ కాల్ పంపించాడుకదా.... వస్తే వస్తుంది-

లేకపోతే లేదు- ఇంటర్వ్యూకు వెళ్ళిరావటంలో నష్టమేమీలేకగా?" అన్నారు నాన్నగారు.

పరేసటి ఇంటర్వ్యూకెళ్ళాను. ముప్ఫైమందిదాకా వచ్చి వున్నారు అందులో పదిమంది గరల్స్

ఇంటర్వ్యూకు వచ్చినవాళ్ళంతా వణికిపోతున్నారు. జనరల్ నాలెడ్జ్ బుక్స్ తిరగేస్తున్నారు.

నే నలాంటిదేమీ చెయ్యలేదు. వస్తే చెబుతాను, రాకపోతే రాదని చెబుతాను ఎట్లాగూ నా కీ ఉద్యోగం రాదు - రాకపోయినా నాకు వెళ్ళకపోయేదేమీలేదు. కాబట్టి భయపడటం దేనికి?

నా పేరు పిలిచినప్పుడు ఎలాంటి జంకుగొంకులూ లేకుండా లోపలికెళ్ళాను.

ఇంటర్వ్యూ చేస్తున్న ఆఫీసర్ చాలా మంచివాడులాగే వున్నాడు. చాలా మర్యాదగా, చాలా ఇన్‌ఫార్మల్‌గా మాట్లాడాడు. మొదట జనరల్‌గా ఏదో అడిగాడు. అన్నీ నాకు తెలిసినవే అడిగాడు. చకచకా చెప్పేశాను. టెక్స్ట్ బుక్స్ చదవటం చేతగాదు గానీ రోజూ న్యూస్‌పేపరు చదవటం నాకు చాలా చిన్నతనంలోనే అలవాటయింది. కాబట్టి జనరల్‌నాలెడ్జి ఫర్వాలేదు. తర్వాతేదో ఇంగ్లీషు ప్యాసేజీయిచ్చి దాన్ని తెలుగులోకి అనువదించమన్నాడు. అపనికూడా చాలా సులభంగానే చేశాను. మొత్తంమీద అతన్ని చాలా ఇంప్రెస్ చేశాను.

అనువాదం చూసి "వెరీగుడ్" అన్నాడు.

"ఈ ఉద్యోగం ఇస్తే చేస్తావా అమ్మాయి?" అన్నాడు.

"మీ రిస్తే ఎందుకు చెయ్యను?"

"ఆడపిల్లలకు ఉద్యోగా లివ్వాలంటే మాకొంచెం భయం. పెళ్ళికాగానే వెళ్ళిపోతారు."

"నా కిప్పట్లో పెళ్ళికాదులెండి" అన్నాను మొండిగా.

"ఏం?"

"కట్నం కానుకలకమ్ముడుపోయే పెళ్ళికొడుకులంటే నాకు పరమఅసహ్యం. అలాంటి వాళ్ళను పెళ్ళాట్టంకంటె ఇలాంటి ఉద్యోగమేదైనా చేసుకుని బ్రతకటం నా కెంతో హాయిగా వుంటుంది."

"వెరీ గుడ్.... మీ ఆడపిల్లలందరికీ ఈమాత్రం పట్టుదల వుంటే ఈ దేశం చాలా త్వరగా బాగుపడుతుంది" అన్నాడాయన.

"థాంక్యూ సర్" - అన్నాను.

"యూ కెన్ గో నౌ...." అనగానే నేను బయటపడ్డాను.

వారంరోజులు తిరిగేలోగా పోస్టుమాన్ తెచ్చిచ్చిన 'అపాయింట్ మెంట్ ఆర్డర్' చూసి అదిరిపడ్డాను. ఈ రోజుల్లో కూడా మిరకిల్స్' జరుగుతున్నాయనిపించింది.

'నేను ఉద్యోగంలో జాయిన్ కావటమా? మానటమా అన్నది మా యింట్లో ఓ రెండ్రోజులపాటు చర్చనీయాంశమై పోయింది.

"ఆడపిల్ల - పదిమంది మొగవాళ్ళ మధ్య కెళ్ళి ఉద్యోగం చెయ్యాల్సిన అవసరం దానికేంపట్టిందండీ?" అంది మా అమ్మ.

"మా అమ్మ మాటమాటకు నన్ను 'ఆడపిల్ల' ఆడపిల్ల అని అనటం నాకు అసహ్యంగావుంటుంది. మా అమ్మ అలా అంటోంది కాబట్టే నాకు వెంటనే ఉద్యోగంలో జాయినయిపోవాలనిపించింది.

"కొద్ది ఉద్యోగమే కావచ్చు - కాని ఉద్యోగంచేసి కొంత సంపాదించి మన అవసరాలు మనం తీర్చుకోవటంలో వుండే సంతృప్తికోసం చైతన్యను ఉద్యోగంలో జాయిన్ కమ్మనే నే నంటాను. పదిమందిలోకి వెళ్తేనే మనకు ప్రపంచం తెలుస్తుంది. విభిన్న మనస్తత్వాలు గల వ్యక్తులతో పరిచయ మేర్పడుతుంది - మన కాళ్ళమీద మనం నిలవగలమనే ఆత్మవిశ్వాసం ఏర్పడుతుంది" అన్నారు నాన్నగారు.

నాన్నగారంటే యిందుకే నాకు చాలా ఇష్టం - సాంప్రదాయం చట్టుబండలు అంటూ కూర్చోరు - ఎప్పుడూ ముందుకు వెళ్ళమనే అంటారు.

"వెల్ సెడ్ నాన్నగారూ....! మీ అభిప్రాయమే నా అభిప్రాయం. రేపే ఉద్యోగంలో జాయినవుతాను," - అన్నాను.

అంతే. ఉద్యోగంలో జాయినయిపోయాను. నాతోపాటు మరో మగ్గురు అమ్మాయిలుకూడా అపాయింట్ చేశారని తెలిసి చాలా సంతోషించాను.

ఆఫీసులో జాయినవటానికి వెళ్ళిన మొదటిరోజు మా ఆఫీ

సర్- ఆ రోజు నన్ను ఇంటర్వ్యూ చేసిన రామ్మోహనరావుగారే - మాతో చాలాసేపు మాట్లాడారు.

"నలుగుర్ని ఆడపిల్లల్నే అప్పాయింట్ చేశానని మా ఆఫీసులోనే నాగురించి రకరకాలుగా చెప్పుకుంటారని నాకు తెలుసు. బట్.... ఐ డోంట్ కేర్.... మిమ్మల్ని ఆడపిల్లలని కాకుండా ప్యూర్లీ ఆన్ మెరిట్ నేను అపాయింట్ చేశాను. ఇంటర్వ్యూలో మీరు నలుగురూ నన్ను ఎంతో ఇంప్రెస్ చేశారు.... మీ ఎకటకూడా అలాంటి టాక్ వస్తుంది. నాకేదో ఉమెన్‌పిచ్చి వుందనో స్త్రీపక్షపాతం వుందనో - అందుకే నలుగురు ఆడపిల్లల్ని అపాయింట్ చేశానని అనుకుంటారు. అలాంటి లూజ్‌టాక్‌ని మీరు ఇగ్నోర్ చెయ్యండి- మీ పని మీరు సిన్సియర్‌గా చేసి మిమ్మల్ని నేను ప్యూర్లీ ఆన్ మెరిట్ సెలక్ట్ చేశానని రుజువుచెయ్యండి- మిమ్మల్నిప్పుడు టెంపొరరీగా అపాయింట్ చేస్తున్నాను. రెండు మూడు నెలలతర్వాత మీకు వరో టెస్టుంటుంది. ఆ టెస్ట్‌బట్టి, ఈమధ్యకాలంలో మీ వర్క్‌నిబట్టి మీ సర్వీసెస్‌ని రెగ్యులరైజ్ చేస్తాము.... సో.... గో ఎహెడ్.... మీ పనేమిటో తెల్సుకుని సిన్సియర్‌గా, ఎఫిషియెంట్‌గా చెయ్యండి...." అన్నాడు.

"అలాగే సర్"- అంటూ మా కప్పజెప్పబడిన సెక్షన్స్‌లోకి వెళ్ళాం- మా ఆఫీసర్ అంటే నాకు చాలా గౌరవం కల్గింది.

నాకు కంప్లైయింట్స్ సెక్షనిచ్చారు.

సెక్షన్లో కెళ్ళగానే నాదృష్టి విక్రమ్‌కుమార్‌మీద పడింది- వెంటనే నాకు కాలేజీహీరోలు గుర్తొచ్చారు- "ఇక్కడో హీరో వున్నట్టున్నాడే," అనుకున్నాను.

నాపనేమిటని మా సూపర్నెంట్ మాధవరావునడిగితే అనవసరంగా ఈ విక్రమ్‌కుమార్ జోక్యంచేసుకోవటంతో నాకు వళ్ళు మండింది.

పెద్దపోజుపెట్టి- 'మీరు చెయ్యాల్సిన పనేమిలేదు- రోజూ హాయిగా యిలాగే కూర్చుని నెలాఖర్లో జీతం తీసుకుపోవచ్చు' అన్నాడు- అతనిగొంతులో ధ్వనించిన ఆ వెటకారం, తేలికతనం నన్ను రెచ్చగొట్టాయి - వెంటనే నేనంటే ఏమిటో అతనికి చూపించాలనిపించింది.

"ఓహో! అంటే నాపనికూడా మీరే చేస్తారన్నమాట! వెట్టి చాకిరి రద్దుచేశారని ఇటీవలనే పేపర్లో చదివానే!" - అన్నానతని కంటె వెటకారంగా.... ఉతనికంటె తేలికభావాన్ని ప్రదర్శిస్తూ-

ఆ దెబ్బతో చచ్చుంటాడు మానవుడు.

ఆ తర్వాతింకేదో అనబోయాడు. అతనన్న ప్రతిమాటను అతనికంటె తెలివిగా తిప్పికొట్టాను.

అయినా చివరకు మా సూపర్నెంట్ అతన్నే నేను చెయ్యాల్సిన పనేమిటో చూపించమన్నాడు. విక్రమ్ కాస్త బెట్టుచెయ్యబోయాడు. కాని చాలా తెలివిగా అతనితో నా కొక్కావాల్సిన పనిని చేయించుకోగల్గాను.

విక్రమ్ కాస్త పోజు కొట్టాడుకాని, సభ్యత, సంస్కారం, తెలిసినవాడే. ఈ విషయంలోనే మా ఆఫీసులో వన్నెపే మిగతా వాళ్ళకి అతనికి చాలా తేడా కన్పించేది- మిగతావాళ్ళంతా ఆడవాళ్ళ విషయంలో అడవి మనుషుల్లా ప్రవర్తించేవాళ్ళు.

మా ఆఫీసర్ అనుకున్నట్టే మా ఆఫీసులో మా ఎదుటే మా గురించిన కామెంట్స్ ప్రారంభమయ్యాయి.—

"అసలు నన్నడిగితే ఈ ఆడపిల్లలు ఉద్యోగాలు చెయ్యటం అనవసరం అంటాను. ఎవడో ఒకర్ని పెళ్ళిచేసుకుని వాడికి పిల్లల్నికంటూ, వాడికి వంటచేసిపెడ్తే కాలం గడిచిపోతుంది. ఇవే ఉద్యోగాలు మగవాళ్ళకిస్తే బతికిపోయేవాళ్ళు...." అంటాడు రాజశేఖరం.

ఈ రాజశేఖరం మాట్లాడినప్పుడల్లా నాకు వళ్ళు మండిపోతుంది నోరు తెరిస్తే బూతులు తప్ప కాస్తసంస్కారంగా మాట్లాడటం తెలీదు.

"మిమ్మల్నడిగితే యింకా యిలాంటి స్టేట్మెంట్స్ చాలా యిచ్చేవాళ్ళే....కాని మిమ్మల్ని అడిగేంత స్థితికి ఈ దేశ మింకా దిగజారలేదు" అన్నాను కసిగా....

చుట్టుపక్కల కూర్చున్నవాళ్ళంతానవ్వారు. విక్రమ్ గొల్లున నవ్వాడు. కాస్సేపటివరకు రాజశేఖరం తేరుకోలేదు.

"రాజశేఖరం.... నీ అభిప్రాయాల్నిలా ఇష్టమొచ్చిన చోటల్లా వెలిబుచ్చితే యిలాంటి ప్రమాదాల్ని చాలా ఎదుర్కోవాల్సి

వస్తుంది.... మన ఆఫీసులో పరిస్థితి మారింది.... కాబట్టెందుకైనా మంచిది.... కొంచెం జాగ్రత్తగా వుండటం మంచిది...." అన్నాడు విక్రమ్.

ఆడవాళ్ళు ఉద్యోగాలు చేస్తున్నారంటే ప్రతిమొగాడూ ఇలా ఎందుకు గింజుకోవాలో నా కర్థంకాదు మా ఆఫీసర్ కు ఆడపిచ్చి వుందిట- అందుకే మా నల్గుర్నీ ఆడవాళ్ళను చూసి ఉద్యోగాలి చ్చాట్ట. లోపాయకారిగా వీళ్ళింకా ఏంఇచ్చుకున్నారో- సూర్యారావు అనే, మా ఆఫీసులోనే పనిచేసే ఓ నాస్టీఫెలో ఫ్రెండ్స్‌తో చెబు తూంటే నాకు విన్పించింది- వెంటనే వాడి పళ్ళు రాలగొడ్దామను కున్నాను. అప్పుడు నా పక్కనేవున్న ఉమ వద్దని వారించింది.

"మన ఆఫీసర్ ఏమని చెప్పాడు? మీ గురించి ఎవరైనా కామెంట్ చేస్తే జస్ట్ ఇగ్నోర్ చెయ్యమని చెప్పలేదూ? మనమిప్పు డేమన్నా అంటే ఇక్కడో సీన్ అవుతుంది. అసహ్యంగా వుంటుంది. వాళ్ళు బుద్ధిలేకుండా ప్రవర్తిస్తున్నారని మనమూ అలా ప్రవర్తి స్తామా? కొత్తలో రెండు మూడ్రోజులలాగే గింజుకు చస్తారు. తర్వాత వాళ్లే అడ్జస్టయిపోతారు. మెదలకుండా మనపని మనం చేసుకుపోతే చాలు. కాస్త ఓపికపట్టు లల్లీ!" అంది.

ఉమ అంటే నాకు చాలా గౌరవం. నాలాగా గబగబా మాట్లాడదు - చాలా తక్కువగా మాట్లాడుతుంది. మాట్లాడిన ప్రతి మాటా ఎంతో అర్థవంతంగా వుంటుంది. అంతేకాదు, ఉమను చూడగానే "అబ్బ! ఈ అమ్మాయి ఎంతఅందంగా వుంటుంది!" అని ఎవరైనా ఓ క్షణంపాటు ఆమెకేసి అలాగేచూస్తూ వుండి పోతారు. నేనే అంత అందంగా వుండివుంటే నా కాళ్ళు ఈ భూమ్మీద నిల్చేవి కావనుకుంటాను. కాని ఉమకి తాను గొప్ప సౌందర్యవతి నన్న గర్వం ఏకోశానా వుండేదికాదు. తాను అందంగా వుంటుం దన్న విషయం తనకసలు తెలుసో తెలియదో అన్నంత అమాయ కంగా కన్పించేది ఉమ. చాలా త్వరలోనే నేను ఉమతో ఫ్రెండ్ షిప్ చేసుకున్నాను.

లీల - మాతో ఎక్కువగా కలిసేదికాదు. చాలా త్వరలోనే లీల చాలా పిరికిదని తెల్సుకున్నాను. ఆమెకి పెళ్ళయింది. పిల్లలు కూడా వున్నార్ట - వాళ్ళాయన పట్టి అనుమానం మనిషట - ఏ మగ

వాడితో మాట్లాడినా అనుమానపడ్తాడు - అందుకే లీల ఎవరితోనూ ఏమీ మాట్లాడేదికాదు. నెలాఖర్లో జీతం తీసుకున్నరోజు లీల భర్త ఆఫీసుకొచ్చి లీల జీతమంతా తీసుకుని వెళ్తుండేవాడు - భర్తను చూడగానే లీల వణికిపోతున్నట్టుగా కన్పించేది-ఇంట్లో ఏంతాదేమో వచ్చే అవమానం కల్గేది - అంత పిరికిగా బ్రతకడంకంటే చావటం నయం అన్పించేది నాకు. ఒకసారి ఇదేమాట ఉమతో అన్నాను.

"ఆ లీల పట్టి బెదురుగొడ్డులా వుందే! చదువుకుంది. ఉద్యోగం చేస్తోంది- తనకాళ్ళమీద తాను నిలబడగల్గే శక్తివుంది- ఆ భర్తంటే అలా వణికిపోతుందెందుకు? మగవాళ్ళ పొలిసీయ.... కనీసం మన్తోనైనా మాట్లాడదేం? ఒకటి రెండుసార్లు పలకరించినా మాట్లాడలేదు - 'దీకే అంతగర్వముంది నాకెంతుండాలి-' అనుకుని ఆ అమ్మాయితో మాట్లాడ్డం మానేశాను...." -

"వాళ్ళాయన మగవాళ్ళతోనే కాదు.... ఆడవాళ్ళతోకూడా మాట్లాడొద్దన్నాట్ట."- అంది ఉమ.

"ఎందుకు?" -

"ఎందుకేమిటి? నీలాంటి ఆడవాళ్ళతో మాట్లాడిందనుకో - 'చదువుకున్నావు. సంపాదిస్తున్నావు - ఆ భర్తగాడికెందుకంత భయపడిపోతావ'ని రెచ్చగొడ్తావు.... స్త్రీస్వాతంత్ర్యం అంటావు. ఇంకేదో అంటావు.... ఇంతకాలం తన గుప్పిట్లోవున్న భార్య ఎదురుతిరుగుతుందని అతడి భయం...." -

"బుద్ధిలేకపోతేసరి! ఆ భర్తగాడికొక్కడు! ఈవిడకే! ఎవర్తోనూ మాట్లాడొద్దని అతడు చెప్తే గంగిరెద్దులా తలూపుతుందా? అసలు ఈదేశంలో స్త్రీలు బాగుపడ్తారన్న ఆశ నాకు రోజురోజుకూ అడుగంటిపోతోంది - అసలు అనవసరంగా మొగవాళ్ళను అడి పోసుకుంటాంగాని! మనస్త్రీలు బాగుపడకపోవడానికి కారణం మన స్త్రీలే నంటాను.... ఈ లీలలాంటిదికూడా యింత బానిసబ్రతుకు బ్రతకడానికి సిద్ధమైందంటే పాపం - ఏమీ చదువుకోకుండా అజ్ఞానంలో మునిగి తేల్తున్న వేరే ఆడవాళ్ళ సంగతి చెప్పాలా?"-

"....ఒకరోజు నీగురించి లీల ఏమందో తెలుసా?" - అంది ఉమ నవ్వుతూ -

"ఏమందేమిటి?"-

వణుకుతాయట.... మగవాళ్ళతో అలా మాట మాట అంటూ గంట లగ్గంటలు వాళ్ళతో వాట్లాడటానికి ఆమెకెంతధైర్యమండీ అంది."

"ఏడవలేకపోయింది" - వృక్షములేనిచోట ఆముదపుచెట్టే మహావృక్షమన్నట్టు నే నామెకళ్ళకు పెద్దధైర్యసంతురాలిలాగా కన్పిస్తున్నానా!"- అన్నాను.

ఇక మాతోపాటు పనిచేస్తున్న సుల్తానా — రోజూ నల్లటి పరదా వేసుకుని రిక్షాలో ఆఫీసుకొచ్చేది- రిక్షాదిగి ఆఫీసులో ప్రవేశించాక పరదా తీసేసేది- ఆ పరదామీద ఇంత కిరోసిన్ పోసి తగులబెట్టాలనిపించేది నాకు. ఒకరోజు సుల్తానాను అడిగేశాను:

"ఇంత చదువుకున్నావు....నలుగుర్లో కూర్చుని ఉద్యోగం చేస్తున్నావు....ఇంకా పరదా ఏమిటి? నాన్ సెన్స్.... లేవట్నుంచి ఆ పరదా తీసేసి రాకపోతే నిన్ను ఆఫీసుకు రానివ్వం....మొత్తం స్త్రీజాతికే అవమానం...." అని.

పావం- సుల్తానా కళ్ళనీళ్ళుపెట్టుకుంది- సుల్తానాకు తెలుగు సరిగారాదు- కాని ఉర్దూ, ఇంగ్లీషు చక్కగా మాట్లాడుతుంది.

"పరదా వేసుకుని రావటం నాకుమాత్రం ఇష్టమనుకున్నావా? మా వాళ్ళు వేషం చస్తానని స్ట్రైక్ చేసినాసరే, నన్ను పరదా వేసుకోకుండా బయట అడుగుపెట్టనివ్వరు.... కాలేజీలో చదువుతున్నప్పుడు ఇలాగే పరదా వేసుకొని వెళ్ళేదాన్ని.... ఇప్పుడూ పరదా వేసుకునేవస్తున్నాను.... మా గ్రాండ్ ఫాదర్ రాకాయసన్నాడు- మా ఇంట్లో ఆడవాళ్ళెవరైనాసరే- పరదాలేకుండా బయటకడుగు పెట్టారో- చంపేస్తాడు అయనెప్పుడు చస్తాడాఅని ఎదురు చూస్తున్నాను- అయన టికెట్ తన్నేసిన తెల్లారే నేనీ పరదాకు అగ్గిపుల్ల అంటించేస్తాను...."

"అంతదాకా వెయిట్చేసే ఓపిక నాకు లేదు. నేనీరోజే ఆ పని చేస్తాను. ఏమీ అవదు సుల్తానా! మనం భయపడినంతకాలమే వీళ్ళు భయపెట్టేస్తుంటారు....మనం తిరగబడ్డామో, నోరు మూసుకుంటారు....తెల్సిందా? ఈ రోజు నువ్వు పరదాతీసేసి మీ యింటికెళ్ళు.... ఏమంటారో చూద్దాం" అన్నాను,

చదివేరోజుల్లో నీలాగే ఓ అమ్మాయి ప్రొవోక్ చేస్తే పరదాతీసేసి వెళ్ళాను. మా గ్రాండ్‌ఫాదర్ ఎం౯గోం చేశాడో వ్యూహించ లేవు- కత్తితో నరికేస్తానని నా వెంటపడ్డాడు. మా నాన్నగారు కూడా మరోసారి ఇలా చేశావంటే ఇక కాలేజీకి పంపించను అన్నాడు. ఆ తెల్లారినుండి మామూలుగా పరదా వేసుకునే వెళ్ళాను. ఇప్పుడు మళ్ళీ పరదా తీసేసి వెళ్ళాననుకో....నన్ను తప్పనిసరిగా ఉద్యోగం మాన్పించేస్తారు.... కనీసం ఈ ఉద్యోగం చేస్తున్నంత సేపైనా కొంత స్వేచ్ఛను పొందకల్గుతున్నాను. అదికూడా దూరం చేస్తావా చైతన్యా!" అంది సుల్తానా

ఏం చెప్పను? పరిస్థితి ఇంత దారుణంగా వుంటుందని ఎలా వూహించను....

* * * *

మొదటినెల జీతం తీసుకున్నప్పుడు చాలా హాయిగా ఫీలయ్యాను. కష్టపడి సంపాదించడంలో వున్న తృప్తి ఏమిటో అర్థమైంది. మాయింట్లోవాళ్ళందరికీ ప్రెజెంట్స్ తీసుకెళ్ళాను.

ఆఫీసులో నేను చాలా ఫ్రీగా వుండేదాన్ని అందరితోను మాట్లాడేదాన్ని. అందర్నీ క్యాంటిన్‌కు రమ్మని పిల్చేదాన్ని. మొదట్లో కొందరు నా ఈ ప్రవర్తనచూసి కనుబొమ్మలెగరేశారు. కాని చాలా త్వరలోనే- ఈ అమ్మాయి తీరే ఇంత అని నోరు మూసుకుని వూరుకున్నారు.

ఎందుకోగాని ఎవర్తో మాట్లాడినా నాకు విక్రమ్‌తో మాట్లాడి నంత తృప్తిగా వుండేదికాదు విక్రమ్ చాలా తెలివిగా మాట్లాడ్తాడు. అతనికన్న తెలివిగా మాట్లాడాలని ప్రయత్నించేదాన్ని. మాటలతో అతన్ని ఓడించినప్పుడల్లా నాకుఎవరెస్టుశిఖరాన్నెక్కినంత గర్వంగా వుండేది. నేనే చాలా తెలివిగామాట్లాడగలనన్న అతని నమ్మకాన్ని చాలావరకు వమ్ముచేయగల్గాను.

ఒకరోజు విక్రమ్ ఓ సినిమాలో కలిశాడు. ఆడవాళ్ళే మగ వాళ్ళను బానిసలుగా చేస్తున్నారని.... ఏదేదో వాదించాడు. నాకు తెలుసు-అతడు కేవలం నన్ను ఉడికించటానికే అలా మాట్లాడు తున్నాడని - ఆ సినిమా చెత్తగావుంది - ఆ సినిమా చూస్తున్నంత

చేస్తూ ఆ సినిమా తీసినవాడి కనుగ్రుడ్లు పెరికెయ్యాలన్నంత కసి పుట్టింది- ఆ సినిమాలో చదువుకున్న ఆడవాళ్ళను చాలా ఘోరంగా అవమానించాడు. చేసుకున్నవాడు పరమ దుర్మార్గుడు, తాగుబోతు అయినాసరే వాడు తిట్టినా, తన్నినాసరే వాడే దైవం, వాడే సర్వస్వం అని నమ్మి వాడ్ని పూజించిన భార్యే చివరంతు సుఖంగా వుంటుంది- స్త్రీకి స్వేచ్ఛ కావాలని తన వ్యక్తిత్వాన్ని కాపాడుకోవాలని తనను అవమానించే భర్తను వదిలేసినా తప్పుకాదని నమ్మిన ఓ ఆధునిక భావాలుగల యువతిని ఘోరంగా పతనమైపోయినట్లు చూపిస్తాడు. ఈరోజుల్లోకూడా ఇలాంటి సినిమాలొస్తున్నాయి కావటమే కాదు. ఇలాంటిసినిమాలు సక్సెస్ అవుతున్నాయి- ఈ సినిమా బావుందని చాలామందినోట విన్నాను ఈ సినిమా బావుందన్న ప్రతి అర్ధమైనవాడితో గంటలకొద్దీ వాదించాను కూడా. ఈ సినిమా విజయవంతంకావటానికి ఒక్కటే కారణం - ఇప్పటికీ ఈ ఇరవయ్యో శతాబ్దపు ఆఖరుఘడియల్లోకూడా ఈ మగమహారాజులు ఎలాంటిస్త్రీని ఆదర్శస్త్రీగా భావిస్తారో ఇలాంటిసినిమా విజయం ఋజువు చేస్తోంది. పూర్వపు పతివ్రతలకు ఈనాటి ఈ సినిమాలకు తేడా ఏమీ లేదు. ఎంతటి దుర్మార్గుడైనా సరే- పతియే సతికి ప్రత్యక్షదైవం ఈనాటికీ ఈనీతి మారలేదు

సినిమాచూసిన తెల్లారి విక్రమ్ ఈసినిమా ప్రసక్తి తీసుకొస్తాడని నాకు తెలుసు- నేనా సినిమాను ఏకిపారేస్తానని అతడు చాలా సులభంగా వూహించగలడని నాకు తెలుసు- నన్నింకా ఉడికించాలని తను ఆ సినిమా బావుందని తెగపొగిడేస్తాడు ఎలా నన్ను ఉడికించాలో ఆ రాత్రంతా ఆలోచిస్తూనే వుంటాడు. ఆయుధాలన్నీ మారి నామీద ప్రయోగించటానికి సిద్ధంచేసుకుంటాడని నాకు తెలుసు. అతన్ని షాక్ చెయ్యటానికి.... అతడు తయారుచేసుకున్న ఆయుధాలన్నింటినీ వ్యర్థంచేయటానికి నేనో ప్లాను తయారుచేసుకుని వెళ్ళాను. నాకా సినిమా నచ్చిందంటాను ఆ దెబ్బతో అతడు చచ్చివూరుకుంటాడు పూర్ మ్యాన్.

తెల్లారి సరిగ్గా నే ననుకున్నట్టే జరిగింది. ఆ పిక్చర్ నాకు నచ్చిందనేసరికి సగం చచ్చాడు. ఆతర్వాత మా రోల్స్ రివర్సయ్యాయి. నేను మాట్లాడాల్సిన మాటలు అతడు మాట్లాడ్తుంటే

ను భలే ఎంజాయ్ చేశాను.

"తెలుగు సినిమాల్లో థీమ్, రీజన్, లాజిక్, వాస్తవికత, పీటికోసం వెతకటమంత ఫూలిష్‌నెస్ ఇంకేమన్నా వుంటుందా? సినిమాలు నేను కేవలం టైమ్ కిల్లింగ్‌కోసం చూస్తాను. టైమ్ కిల్లింగ్‌కోసం తీనే ఇటాలియన్లతో పాటు తెలుగు సినిమాలు కూడా అంతే" నని భలే క్లెవర్‌గా తప్పించుకున్నాను పాపం, విక్రమ్ అవస్థచూస్తే అతనిమీద నాకు చాలా జాలేసింది.

విక్రమ్ కొన్నిసార్లు చాలా విచిత్రంగా ప్రవర్తించేవాడు. అతన్ని నేనెంత ఏడిపించినా, నామీద తన కేదో అధికారం వున్నట్టుగా, నేను అతన్తోతప్ప ఇంకెవరితోనూ మాట్లాడకూడ దన్నట్టుగా ప్రవర్తించేవాడు. ఒకసారి లంచ్ టైంలో అతను కనిపించ లేదు. ఉమ, సుల్తానా ఆ రోజు ఆఫీసుకు రాలేదు. మొదటే చెప్పానుగా టీం ఎవర్తోనూ కలవను - కంపెనీ లేకుండా నాకు క్యాంటీన్‌కు వెళ్ళబుద్ధికాదు. అందుకే టైపిస్ట్ దామోదర్ని "కాఫీ తాగుదాం రండి" అని పిల్చాను. అత దొచ్చాడు. అక్కడేవున్న రాజశేఖరంకూడా వచ్చి మా దగ్గరే కూర్చున్నాడు. ముగ్గురం కలి ఏవో జోక్స్ చేసుకుంటూ, నవ్వుకుంటూ కాఫీ తాగాం. వాళ్ళుచేసే జోక్స్ కొంచెం మొరటుగావున్నా నేనూ నవ్వేశాను.

తిరిగి సీటుదగ్గరకొచ్చేటప్పటికి తనసీట్లో విక్రమ్ కూర్చుని సిగరెట్ పీలుస్తున్నాడు.

"కాఫీ తాగారా?" అన్నాను మామూలుగా.

"మీరు తాగారుగా? నేను తాగానో లేదో మీకెందుకు," అన్నాడు చాలా విసురుగా

వెధవ విసురాలాడే వాళ్ళంటే నాకు పరమఅసహ్యం. అతడిలా విసురాలెందుకాడుతున్నాడో త్వరగానే గ్రహించాను.

"మీకోసం చూశాను. మీ రెక్కడికో వెళ్ళారు."

"అహా! ఎంత దయ! మీ దయ నా కక్కర్లేదు."

"నా దయ మీ కక్కరుందని నేనేమీ అన్లేదు" అయినా మీ మీద దయ చూపించటానికి నేనెవర్ని" అన్నాను.

కాస్సేపు నిశ్శబ్దం.

"రాజశేఖరం బూతుజోక్స్ చాలా ఎంజాయ్ చేసినట్టున్నారే!

మీ నవ్వు ఇక్కడిదాకా వినిపించింది" అన్నాడు పెద్ద పోజుకొడ్తూ.

"ఔను.... ఏం? నాకు బూతుజోకులంటే చచ్చేంతయిష్టం. మీకేమన్నా అబ్జెక్షనా?" - అన్నాను మొండిగా.

"అబ్జెక్ట్ చెయ్యడానికి నే నెవర్ని?"-

"అలాంటప్పుడు నోరుమూసుకుని వూరుకోండి."

"నేనుకూడా బూతుజోకులు చెప్పగలను.... చెబుతాను.... ఎంజాయ్ చేస్తారా?"-

"ఏమిటి మీ ఉద్దేశ్యం? ఎవరూలేరని కంపెనీకోసం వాళ్ళతో కాఫీ తాగటానికెళ్ళినందుకు ఏదో క్షమించరాని తప్పు చేసినట్టు ఓ పెళ్ళాన్ని మొగుడు సాధించినట్టు సాధిస్తున్నారేమిటి? ఇలాంటి సాధింపు మాటలంటే నాకు పరమ అసహ్యం...." - అన్నాను చిరాగ్గా

నా మాటలు పూర్తికాకుండానే అతడు గొల్లున నవ్వాడు - ఇది మరో పోజు!

"ఎలా సాధించాను? ఏది....ఆమాట మళ్ళీ అనండి...."-

"అనను.... ఎందుకనాలి? అన్నప్పుడే వినకపోయారా? ఏం? చెవులకేమన్నా రోగమొచ్చిందా?"- అంటూ ఫైళ్ళముందేసుకుని ఏదోపనిచేస్తున్నట్టుగా నటించాను ఇంతలో మాసూపరెన్టెంట్ మాధవరావొచ్చాడు.

అగడామాట మళ్ళీ ఎందుకన్నాడో నాకుతెలుసు ఓపెళ్ళాన్ని మొగుడు సాధించినట్టుగా సాధిస్తున్నారేమిటన్నందుకు ఒకరకంగా అతడు సంతోషించాడు - మాటవరసకైనా తనను మొగుడు, నేనతని పెళ్ళాన్ని అన్నట్టుగా మాట్లాడినందుకు అతని మొగబుద్ధి సంతోషించింది - 'మొగబుద్ధి' మొగబుద్ధే; దాన్ని మార్చలేం.

* * * *

నేను విక్రమ్‌తో యెప్పుడూ ఏదో మాట్లాడుతుంటటంవల్ల ఆఫీసులో మెల్లగా మాగూర్చి గుసగుసలు ప్రారంభమయ్యాయని గ్రహించాను. ఒకరోజు ఉమ ఈవిషయం ప్రస్తావించింది.

"నువ్వు ఆ విక్రమ్ యెప్పుడూ అలా మాటల్తో పోట్లాడుకోవటం నాకేం నచ్చలేదే!" - అంది ఉమ.

"జస్టఫన్! దాంట్లో ఏముంది... తనే తెలివిగా మాటాడతా

వనుకుంటాడు.... తనకంటే తెలివిగా మాట్లాడేవా ళ్ళుంటారని రుజువు చెయ్యాలని నా ప్రయత్నం.... అంతకన్నా ఏమీలేదు-" అన్నాను.

"నిజమే.... నీ వటుకు నీకు అది ఫన్నీగానే వుంటుంది కాని మిమ్మల్నిద్దర్నీ చూస్తున్న మన ఆఫీసుజనం ఏమనుకుంటు న్నారో తెలుసా?"

"ఏమనుకుంటున్నారేమిటి?"

"ఓ అబ్బాయి అమ్మాయి ఎప్పుడూ అదేపనిగా మాట్లాడు కుంటుంటే మనజనం ఏమనుకుంటారో ఊహించలేవేమిటి?"

"కొంపదీసి మేమిద్దరమూ ప్రేమించేసుకున్నామని అనుకుం టున్నారేమిటి?"

"ఔను.... సరిగ్గా అలాగే అనుకుంటున్నారు...."

"వాళ్ళలా అనుకుంటే రేపతన్ని ఆఫీసులో అందరిముందే ముద్దు పెట్టేసుకుంటాను. వెధవలంతా కుళ్ళి చావాలి. రోగ్స్.... ఆఫీసులో అత నొక్కడితోటే మాట్లాడుతున్నానా? అందర్తోనూ మాట్లా డుతున్నానే.... మాట్లాడటం నా స్వభావం....ఎన్ని కుక్కలు మొరిగినా నా స్వభావాన్ని మార్చుకోను.... తెలిసిందా!" అన్నాను చిరాగ్గా.

"అబ్బబ్బ! అంతకోపమెందుకే? పెళ్ళికాని ఆడపిల్లలం.... మనమీద యిలాంటి లేనిపోని పుకార్లు ఏమన్నా పట్టాయంటే మన భావిజీవితం నాశనమైపోతుంది...."

"గాడిదగుడ్డుకదూ! నన్ను పెళ్ళాడ్తానని వచ్చినవాడికి మొదటే చెప్పేస్తాను — 'నామీద బోల్డు పుకార్లున్నాయి.... ఆ పుకార్లన్నీ పట్టించుకుంటానంటే ఇప్పుడే గుడ్ బై చెప్పేయండి.... ఐ డోంట్ కేర్ సచ్ పుకార్లు' అన్నవాడినే వెల్‌కమ్ చేస్తాను.... చాలాకాలంనుండి నే నొక రకంగా జీవించటానికి అలవాటుపడ్డాను. ఎవరికోసమూ నా జీవితవిధానాన్ని మార్చుకోదల్చుకోలేదు...." అన్నాను.

"నీతో వాదించటం చాలాకష్టమే....నీ కెలాంటివాడు దొరుకు తాడోగాని వాణ్ణి ముప్పతిప్పలుపెట్టి మూడుచెరువుల నీళ్ళు తాగిం చేట్టున్నావు...." అంటూ ఉమ వెళ్ళిపోయింది.

ట్నుంచి నేను విక్రమ్‌తో ఇంకా రాసుకుతిరగటం మొదలెట్టాను. కావాలని అతన్ని రెచ్చగొట్టి, అతన్ని వాదనలోకి దించి అతనితో మాటలుపడటమో, లేక అతన్ని మాటలనటమో నాకెంతో హాయిగా ఉంటుండేది. అతనితో సినిమాలకెళ్ళాను. సినిమాహాల్లో అతని పక్కన కూర్చున్నప్పుడు మమ్మల్నిద్దర్నీ మా ఆఫీసువాళ్ళెవరైనా చూసి 'అమ్మో! ఎంత ఘోరం జరిగిపోతోంది.... ఈ అమ్మాయి ఎంత బరితెగించింది'- అని గుండెలు బాదుకుంటుంటే నాకు వినగ బడి నవ్వాలన్న పిచ్చికోరిక కల్గుతుండేది.

* * * *

ఒక్కోసారి విక్రమ్ మరీ దురుసుగా ప్రవర్తించేవాడు. కోపంతో వాదులిపోయేది. నాకో వెధవ అలవాటుంది. బాగా కోప మొస్తే నాకు ఏడుపొచ్చేస్తుంది. అలా ఏడవకూడ దనుకుంటాను. కాని ఆ క్షణంలో నా కేమవుతుందో తెలీదు. నన్ను నేను కంట్రోల్ చేసుకోలేకపోతాను. ఒకటి రెండుసార్లు విక్రమ్‌తో పోట్లాడుతూ యేడ్చేశాను. 'ఈ పొగరుబోతుపిల్లను ఏడిపించావ'ని మానవుడు తెగ మురిసిపోతుంటాడు. మరోసారి అతనిముందలా ఏడవ కూడదని గట్టిగా నిర్ణయించుకున్నాను. కాని ఏంలాభం? ఒక్కోసారి మనమీద మనకు కంట్రోల్ లేకుండాపోతుంది. ఏ అదృశ్యశక్తో మనను వశపరచుకుంటుంది. ఇలాంటిసమయాల్లోనే నాకుఆడదాన్నై ఎందుకుపుట్టానా అని బాధ కల్గుతుంది. నాలోని 'ఆడతనాన్ని' జయించాలని నేనుచేస్తున్న ప్రయత్నమంతా వ్యర్థమయిపోయినట్టు ఫీలౌతాను

* * * *

ఒకసారి హైదరాబాద్ వెళ్తే అక్కడ కళాభవన్‌లో సాయి కృష్ణ అనే ఆర్టిస్ట్ 'గీతగోవింద' ఆధారంతో వేసిన రేఖాచిత్రాలు చూశాను. ఆ చిత్రాలు నా కెంతనచ్చాయో! ఆ ఆర్టిస్టు రాధా మాధవుల్ని ఎంత ముగ్ధమనోహరంగా చిత్రించాడో మాటల్లో చెప్పలేను ప్రతిచిత్రంలోనూ జీవంతొణికిసలాడ్తోంది. అచిత్రాల్ని చూస్తూ నన్నునేను మర్చిపోయాను. ఆ చిత్రాల్నిచూడటం నా జీవితంలో ఒక మధురాతిమధురమైన అనుభవంగా నిల్చిపోయింది.

... అతడూ
ఎంతో మృదువుగా సున్నితంగావున్నాడు. చిన్నకుర్రాడిలా ఎంతో ముద్దొస్తూ కనిపించాడతను. అతన్ని గట్టిగా ముద్దుపెట్టేసుకోవాలనిపించిందికాని, ఈ పాడుదేశం! నేనలాచేస్తే ఎంతమంది ఎన్ని విధాలుగా వ్యాఖ్యానిస్తారో! కేవలం ఆ ఆర్టిస్టుమీది అడ్మిరేషన్‌తో ఆ అమ్మాయి అలా చేసిందని ఎందుకనుకోరు? మనవాళ్ళకు ప్రతి దాంట్లోనూ సెక్సే కనిపించేది. ఓ అమ్మాయి అబ్బాయి మాట్లాడుకున్నారంటే చాలు-ఆరాత్రి వాళ్ళిద్దరూ పడుకున్నారనే మనవాళ్ళు ఊహించేస్తారు. బూతు ప్రతిదాంట్లోనూ మనవాళ్ళుచూసేది బూతే- మనవాళ్ళ మనసులనిండా బూతే - మెదళ్ళనిండా బూతే - ఈ బూతులో పడిపోయి రోజూ ఎంత గొప్ప సౌందర్యాన్ని, ఎన్నో అనుభూతుల్ని, ఎంత ఆనందాన్ని కోల్పోతున్నారో ఈ జనం."-

సాయికృష్ణ చిత్రాలు నాకు నచ్చాయని ఉమతో చెబుతూంటే పిలవని పేరంటంగా విక్రమ్ జోక్యం చేసుకోవటంతో నా ఒళ్ళు మండిపోయింది.

నేనంతగా పొగుడుతున్నానని అతడా చిత్రాన్ని చూడకుండా-పెట్టకుండా నిందించటం మొదలెట్టాడు - అది ఫ్యూడల్ ఆర్టుట - గీతగోవిందం నిండా బూతే వుందిట-"గో టు హెల్" అన్నాను. పెద్ద మార్క్సిస్టు బయల్దేరాడు - ఫ్యూడల్ ఆర్టు బూర్జువా ఆర్టు-అంటూ.—

అసలు విక్రమ్ ఆరోజు అలా విరుచుకుపడ్డం ఎందుకో నాకు తెలుసు.—

నేను ఆ చిత్రాలనేకాదు - ఆ చిత్రాలు వేసిన ఆర్టిస్టునికూడా కలుసుకున్నాననీ. అతడెంతో అందంగా, నాజూగ్గా పెయింటాడని చెప్పటాన్ని అతని మొగబుద్ధి హర్షించలేకపోయింది. జెలసీతో ఉడికిపోయాడు. ఈ మగవాళ్ళలో వుండే మాయరోగమే ఇది. కాస్త చనువుగా మాట్లాడితే చాలు - వాళ్ళకు మనమీద ఏదో అధికారం ప్రాప్తించిందనుకుంటారు. మనం వాళ్ళ ప్రైవేట్ ప్రాపర్టీగా మారిపోయామనుకుంటారు. కాస్త చనువుగా మాట్లాడినందుకే వీళ్ళిలా ఫీలయితే, తాళిగట్టిన ఆ మొగుడు మహాశయుడు పెళ్ళాన్ని తన ప్యాంట్‌లాగానో, షర్టులాగానో, టీవీలాగానో, బాక్స

లాగానో చూసుకోవటంలో ఆశ్చర్యం లేదనుకుంటా. అందుకే ఎప్పుడో అప్పుడు ఎవడో ఒకడు నాకూ కూడా తాళికడ్తాడు. నన్ను వాడి ప్రైవేట్ ప్రాపర్టీగా చూసుకుంటాడు అన్న భావం కల్గినప్పు డల్లా వణికిపోతాను. అంతకంటే చావు నయమనిపిస్తుంది.

* * * *

ఉన్నట్టుండి ఉమ నాదగ్గర మరోసారి విక్రమ్ ప్రసక్తి తెచ్చింది ఓ ఆదివారం ఉద్దరం పిక్చర్ కెద్తోంటే -

"మొన్న మా సెక్షన్లో పనేసే మురళీధర్రా వేమన్నాడో తెలిసా ?" అంది ఉమ.

"ఏమన్నాడేమిటి ?"

"మీ ఫ్రెండ్ చైతన్య విక్రమ్‌తో మరీక్లోజ్‌గా తిరుగుతోంది-విక్రమ్‌కు పెళ్ళయిందన్న సంగతి మీ ఫ్రెండ్‌కు తెలుసా ?" అని అడిగాడు. నేను తెలీదన్నాను. 'మీరైనా చెప్పండి.... అతనికి పెళ్ళయింది. పిల్లలుకూడా వున్నారు.... కాని పెళ్ళికానివాడిలా పోజుకొడ్తూ చైతన్యలాంటివాళ్ళను మోసం చేస్తుంటాడు. మీ ఫ్రెండ్‌ను జాగ్రత్తగా వుండమనండి' అన్నాడు - విక్రమ్‌కి పెళ్ళయిందని తెల్సినప్పుడు నేనుమాత్రం షాకైపోయాను. "నీకు పెళ్ళయినట్టు నీ కెప్పుడైనా చెప్పాడా ?"-

అతనికి పెళ్ళయినట్టు తెలిసినప్పుడు నేనుకూడా కొంచెం షాకయినమాట వాస్తవమే....అలాషాకవటానికి్కారణం నీళ్ళంతా కొంచెం అనుకున్నట్టుగా అతనిమీద 'నా కేదో వుండటంవల్లకాదు. అతన్ని చూస్తే పెళ్ళయినవాడిలా, ఓ గృహస్థులా కనిపించడు. అతనివేషం, అతని నడక, అతని మాటలు, ఆ స్టయిల్, అన్నీ ఏ బంధనాలు, బాదరబందీలు లేని ఓ కులాసాపురుషు డనిపించేట్టు చేస్తాయి. పెళ్ళయినవాడు యెప్పుడూ అంత కులాసాగా మల్లె పువ్వులా విరగబడ్తూ వుండటానికి వీలవుతుందంటే యెందుకో నమ్మలేకపోయాను. విక్రమ్‌కు పెళ్ళయిందని తెలిసినప్పుడు నేను షాకయినట్టుగాని కనీసం ఆశ్చర్యపడ్డట్టుగాగాని ఉమకు కనిపించ కూడదనుకున్నాను

"చెప్పలేదు.... చెప్పాల్సిన అవసరంకూడా లేదు అతనికిపెళ్ళయి నట్టు తెల్సినప్పుడు నువ్వెందుకే అంత షాకైపోయావు"-అన్నాను.

"నీ బతుకు ఏమైపోతుందోనని...."-

నేనుగొల్లున నవ్వాను- "అంతా భ్రాంతియేనా? అశానిరాశేనా? అంటూ ఓ విషాదగీతం పాడుతూ ఆకులన్నీ రాలిపోయిన ఓ చెట్టు కింద కూర్చుంటాననుకున్నావా? నిజంగా నిన్ను చూస్తే జాలేస్తోందే ఉమా!" అన్నాను.

"ఎందుకు?"

"నీ అమాయకత్వానికి...."

"నిజం చెప్పవే చైతన్యా! అతనిమీద నీ కేమీ లేదా?"

"నిజం చెప్పవే ఉమా! నా మీద నీ కేమీ లేదా?"

"దానికి దీనికి సంబంధమేమిటి?"

"బోల్డు సంబంధం వుంది- మనిద్దరిమధ్యా ఎలాంటి స్నేహం వుందో అతనికీ నాకూమధ్య అలాంటి స్నేహమే వుంది. అంతే."

"వయసులోవున్న ఓ అబ్బాయికి అమ్మాయికి మధ్య వట్టి స్నేహంతప్ప ఇంకేమీ లేదంటే ఎవరన్నా నమ్ముతారా!"

"నమ్మకపోతే ఏ బావిలోనన్నాదూకి చావమను. నా స్నేహితురాలిగా నువ్వే చెప్పవే.... నాకూ అతనికీ మధ్య నీకూ నాకూ మధ్య వున్నలాంటి స్నేహంకంటే ఎక్కువేమన్నా వుందా? రోజూ రాత్రి అతనిపక్కలో పడుకుంటున్నానని నువ్వు నమ్ముతున్నావా?"

"ఛీ....ఛీ! ఏమిటే ఆ మాటలు...."

"నీ మాటలేమో బాగున్నాయా? ఒకవేళ నాకూ పడుకోవాలన్న గాఢమైన కోరికేకల్గితే పడుకుంటానుకూడా నన్నెవరూ ఆపలేరు. కాని ఆతనిపట్ల నాకింతవరకు అలాంటి కోరికకల్గలేదు! జస్ట్....ఫర్ ది ఫన్.... అతన్తొ మాటామాట పెంచుకుంటాను. అతడూ చాలా తెలివైనవాడే....అందుకే అతనితో అలా మాట్లాడాలనిపిస్తుంది మనకు ఒక్కొక్కరిలో ఒక్కొక్కటి నచ్చుతుంది- నాకు సాయికృష్ణబొమ్మలు నచ్చుతాయి బాలసుబ్రహ్మణ్యంపాటలు నచ్చుతాయి. అమితాబ్‌బచ్చన్ యాక్టింగ్ అంటే పడిచస్తాను. కృష్ణశాస్త్రి కవిత్వమంటే ప్రాణం. చలం సాహిత్యం వుంటే నాకు నిద్రాహారాలు అక్కర్లేదు. ఇంతమాత్రాన వీళ్ళందర్నీ ప్రేమించేసినట్టేనా? అసలు ఈ ప్రేమంటే ఏమిటి? ప్రేమనుగూర్చి మాట్లాడే

నూటికి తొంభై తొమ్మిదిమందికి అసలు ప్రేమంటే ఏమిటో తెలీదు"-

"పోనీ.... నువ్వుచెప్పు ప్రేమంటే ఏమిటో?"

"నాకు మాత్రం తెల్సునని చెప్పానేమిటి?" తెలుసుకోవల్సిన అవసరంకూడా నా కేమీ కల్పించలేదు."

"ఇద్దరం సినిమాహాలు చేరేదాకా అలా మాటాడ్తూనే వున్నాము

*　　*　　*　　*

విక్రమకు పెళ్ళయిందని తెలిశాక్కూడా అతన్తో నా ప్రవర్తనలో ఎలాంటి మార్పూ రానీయలేదు - అతనికి పెళ్ళయినట్టు నాకు తెల్సిందనికూడా నే నతనికి చెప్పదల్చుకోలేదు ఈ విషయంలో అతన్ని పరీక్షించా లన్పించింది నా కింకా పెళ్ళికాలేదని అబద్ధమాడతాడా? తనంతటతానే తనకు పెళ్ళయిందని చెప్తాడా?—చూడా లన్పించింది.

చాలా రోజులుగా అత న్నొక్కసారి మా యింటికి పిలవాలనుకున్నాను ఎప్పుడూ ఇలా పోట్లాడుకోవటం కాకుండా కాస్త ప్రశాంతంగా మాట్లాడుకోవాలని వుంటుంది. కాని ఎందుకో అతన్ని చూడగానే అతని మాటలు, ధోరణి చూడగానే అతన్తో పోట్లాడ్తున్నట్టు కాకుండా మామూలుగా మాట్లాడలేకపోతాను

"ఈరోజు సాయంత్రం మా యింటికొక్కసారి వస్తారా?" అని అడిగితే 'వస్తాన'ని మామూలుగా జనాలు చెప్తాంచుంటారు? అలా చెప్తే అతడు 'విక్రమ్. ది గ్రేట్' ఎలా అవుతాడు ?

"ఏమిటి విశేషం? కొంపతీసి ఈరోజు మీ బర్త్‌డేగాని కాదుగదా?" అంటాడు; వెధవపోజు, అప్పుడే ఈయనగార్నెవరు గెస్ చెయ్యమన్నారో....ఇందుకే నాకు వళ్ళు మండుతుంది. ఇదే మన్నా తెలుగు సినిమాఅనుకున్నాడేమిటి, హీరోయిన్‌లాగా బర్త్‌డే చేసుకుని పాటలు పాడుకోటానికి-

నేను తనని మా యింటికి పిలవాలని అతగాడి కెంతగానో వుందని నాకు తెల్సు.... కాని రమ్మనగానే తను అందుకోసమే ఎదురుచూస్తున్నట్టు బయటపడటం అతనికిష్టముండదని నాకు తెల్సు....ఎందు కీ నాటకం? మన మనస్సుమీద ఈ ముసుగుతెరలు కప్పుకోవాలని ప్రయత్నించటందేనికి? ఎందుకి దాగుడుమూతలు?

"ఐ లైక్ యూ చైతన్యా, ఐ లైక్ యూ వెరీ మచ్!"- అని ఓమాట చెప్పొచ్చుగా! చెప్పడు - అలా చెప్తే తన గౌరవం ఏదో పోతుంది - పూర్తిగా బయటపడిపోయానన్న బాధేదో కల్గుతుంది. విక్రమ్‌లాంటి అహంభావాలు కొంత యెక్కువున్న మనుషులు అలా సులభంగా బయటపడ్తారా?

—వాట్ ఎబౌట్ యూ? 'ఐ లైక్ యూ విక్రమ్' అని చెప్పొచ్చుగా? అతడు బైటపడందే నేనెందుకు బయటపడాలన్న మొండిపట్టుదల నాలో - అతను నాటకం ఆడినంతకాలం నేనూ ఈ నాటకం ఆడాల్సిందే - పట్టుదల విషయానికొస్తే అతనెంతో నేనూ అంతే

విక్రమ్ మా యింటికొస్తున్నాడంటే నా మనస్సెందుకో ఉరకలు వేసింది: నాలో ఏదో తడబాటు - ఏదో పారవశ్యం.... ఏదో థ్రిల్.... ఏదో అవుతుందన్న యెదురుచూపు.... చాలారోజుల తర్వాత యేదన్నా రాయాలనిపించింది-ఇంటికెళ్ళగానే నా డైరీ తీసి రాయటం మొదలెట్టాను:

నాగుండెల మండువాలో ఎవరిదా అడుగుల చప్పుడు?
నా మనోవీణను తాకుతున్న ఆ విశృద్ధి కద్దికాంతుడెవ్వడు?
నా ఆరాధన కాకృతి ఎవ్వడు?
అనురాగానికి అర్థం యెవ్వరు?
గుండెలోపలి అరలలో
నన్ను బందీని చేసిన ధీరుడెవ్వడు?
నేను వీణియగ వలపు స్వరాలు
మీటిన వైణికుడెవరు?
దిక్కుదిక్కున నన్ను వెతుకుచు
దిగులు నిండిన కన్నులెవరివి?
మళ్ళపొదలలో మల్లెలకోసం
తడిసి తడిసిన చేతులెవరివి?
'ఎప్పుడూ నువ్వే గుర్తుకొస్తావ'ని
గొప్పగా చెప్పను నేను
ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు
ఏ రాగం అలంబనై నప్పుడు

హృదయ సంస్పందనల్ని వినిపిస్తున్నప్పుడు
ప్రత్యేకించి విన్న గుర్తించుకోను నేను
శ్వాసలోని వెచ్చదనాన్ని
చీకట్లోంచి వచ్చిన
వెలుగునీ - దృశ్యాన్ని
ఎవరు వేరుచేస్తారు?
ఎవరు విడదీసి చూడగలరు?...

....ఇలా రాస్తోంటే నా గుండెలంతా రమేదో తీగ తెగుతున్నట్టుగా, ఎక్కడో మేఘాలమీద తేలిపోతున్నట్టుగా ఫీలయ్యాను.... కాని అతి దొస్తాడు-వెంటనే లేచి త్వరత్వరగా తలంటిపోసుకుని జుట్టుల్ని ఆరబెట్టుకుంటుంటే అక్కను రానేవచ్చాడు.

ఇక్కడైనా కాస్త మామూలుగా మాట్లాడొచ్చుగా!

నాకేసి అదేపనిగా చూస్తోంటే ఏమి టలా చూస్తున్నారు? వెంట్రుకలన్నీ విరబోసుకుని దయ్యంలా కనిపిస్తున్నానా ఏమిటి? అన్నాను. 'లేదు.... దేవతలా కన్పిస్తున్నార'నో, తలంటిపోసుకుని వెంట్రుకల్ని ఆరబెట్టుకుంటున్న స్త్రీలని చూడటం అంటేనాకిష్టమనో జవాబు చెప్పొచ్చుగా.... "దిసీజ్ మై హెల్.... అన్నారుగా.... హెల్‌లో వుండేది దయ్యాలేనా."- అన్నాడు. నాకు వళ్ళు మండి పోయింది.

"అక్షరాలా దయ్యాలే" అన్నాను మొండిగా. అంతే- ఆ రెండుగంటలూ అలా పోట్లాడుకుంటూనే గడిపేశాం. చివరకు నన్ను ఏడిపించి వెళ్ళిపోయాడు.

"ఏదో చెబుదా మనుకున్నాను.... వెధవబుర్ర- మరచి పోయాను. మాట్లాడాలనుకున్నది మాట్లాడకుండా ఏదేదో మాట్లాడు తున్నాను...."- అన్నప్పుడు అతను నానుంచి ఏమాశించాడో ఊహించగల్గాను. కాని.... నే నంతసులభంగా బయటపడ్తానా?

"ఏదో డిపార్టుమెంట్ టెస్టు రాయాల్టి, అందుకు మీ సహాయం కావాలి-" అని నే నటంతో అతని ఉత్సాహం నీరుకారి పోయింది. అతన్ని నేనేదో వంచించినట్టు ఫీలయ్యాడు అందుకే అలా నోటికొచ్చినట్టల్లా తిట్టివెళ్ళిపోయాడు నేనుమాత్రం తక్కువ తిన్నానా? నేనూ నాలుగు గట్టిగానే వడ్డించాను.

ఎంత ప్రాంరంగా మెచ్చుకున్నా రెండుమాటలు మాట్లాడు దామని అతన్ని పిలిస్తే మా యింటికొచ్చానన్న మర్యాదకూడా లేకుండా నన్ను ఏడిపించి వెళ్ళిపోయాడు. అతన్ని క్షమించకూడ దనుకున్నాను. అతడు వెళ్ళిపోగానే నా డైరీలో మళ్ళీ రాసు కున్నాను—

నీవు వచ్చావు- నిన్నటిదాకా భగ్గుమనిపించే
ఇసుకమీది పాదాలకు- మెత్తని చల్లని అలలు
స్పర్శలా సోకి సోకక మునుపే సహించలేని
సముద్రుడు కసిగా లోనికి లాక్కునేలాగు
నీ రాక - నభోగర్వాన్ని చీల్చుకుంటూ
రవ్వలు చిమ్ముతూ రాలిన ఉల్క- అనుకొని
అందం చూడబోతే
పిడుగై ఔదల కూలింది.
ఉదయారుణకాంతిలో
ముడుచుకు పడుకున్న అరుద్ర
మృదుత్వాన్ని ఆశించి ముట్టుకుంటే
నివురుపీడిన ఎర్రని నిప్పుకణికను
తాకినట్టుగా
నా చేతులు కాలిపోయాయి
మలయమారుతంలా వచ్చావు
తుఫానులా వెళ్ళిపోయావు.

* * * *

తెల్లారి ఆఫీసుకు వెళ్ళగానే విక్రమ్‌గా రిచ్చారని ప్యూన్ ఓ పుస్తకాల ప్యాకెట్ యిచ్చాడు. అందులో ఏముంటాయో నాకు తెలుసు. విక్రమ్ యిలాంటి పనేదో చేస్తాడనికూడా నాకు తెలుసు. ఆ పుస్తకాలు తీసి అతని ముఖంమీద కొడదామనుకున్నాను కాని ఇక్కడే నాలోని అభిమానంపాలు తగ్గి స్వార్థంపాలు ఎక్కువ యిందేమో, ఆ పుసకాలు నాకు చాల అవసరం అవి లేకపోతే ఆ టెస్టు ప్యాసుకాలేను ఆ పుస్తకాలు అతని మొఖంమీద కొట్టే దాన్నే- తర్వాత అతడు బ్రతిమాలి ఇస్తాడన్న నమ్మకం వుంటే- కాని విక్రమ్ ఆపని చెయ్యడని నాకు తెలుసు. అందుకే మెదల

కుండా ఆ పుస్తకాలు తీసుకున్నాను.

టెస్ట్ ఎలా రాయాలో, ఏమేం అడుగుతారో రెండు మూడు సార్లు కాస్త మెల్లగానే చెప్పాడు విక్రమ్. అతని కారణంగానే నేను టెస్టు బాగా రాయకల్గాను.

కాని 'టెస్టు ఎలా రాశార'ని అతడు అడిగినప్పుడు బాగానే రాశానని కావాలనే చెప్పలేదు- ఏదేదో చెప్పి అతన్ని ఉడికించాను.

"డిసీజ్ గ్రాస్ ఇన్‌గ్రాటిట్యూడ్" అన్నాడు పెద్ద ఇంగ్లీషొచ్చిన మొనగాడిలా.

"మీ పుస్తకాలు నేననలు చదవనేలేదు పొమ్మన్నాను. రేపు మీ పుస్తకాలు మీకు తెచ్చిస్తానని చెప్పాను- ఇదే ఛాన్స్ అనుకుని అతను వాళ్ళింటికి రమ్మన్నాడు. ఒక్కసారి వాళ్ళింటికి వెళ్ళాలనే వుంది. అందుకే వస్తానని చెప్పాను.

ఇంటికి వెళ్తే అతనికి నిజంగా పెళ్ళయిందో లేదో తెలుసుకోవచ్చు. అతని భార్య ఎలావుంటుందో చూడొచ్చు. అయినా అతని భార్యను చూపిస్తాడా? భార్యను పుట్టింటికి పంపించి వస్తానంటున్నాడేమో: అయినా అతనికి పెళ్ళయిందో, లేదో తెలుసుకోవాలని, అతని భార్యను చూడాలని నాకెందు కింతఆతురత?

అతని ఇంటికెడ్తూ అతడిచ్చిన పుస్తకాలన్నీ ప్యాక్ చేస్తున్నప్పుడు అతడు తనకు నేను కృతజ్ఞతలు చెప్పలేదన్నాడని గుర్తొచ్చింది. వెంటనే నాలుగు మాటలు రాద్దామనుకున్నాను. నా లెటర్‌ప్యాడ్ తీసుకుని నా కృతజ్ఞతల్ని తెలియజేస్తూ నాలుగు మాటలు రాసి ఆ కాగితాన్ని ఆ పుస్తకాలమధ్యలో పెట్టేగాను అతనుండే ఇంటిని చూచి చాలా ఆశ్చర్యపడ్డాను. అతడెప్పుడూ అలా శుభ్రంగా నిగనిగలాడుతూ వుంటాడే- అతనిల్లెంత అందంగా, శుభ్రంగా వుంటుందో అనుకున్నాను - లేదు - అతనిల్లు చాలా దరిద్రంగా వుంది. కూర్చోవటానికి కనీసం ఓ రెండు కుర్చీలు కూడా లేవు చాపమీద కూర్చున్నాను. కాని అతనింటికి వెళ్ళటం నాకొక అపూర్వమైన అనుభవం అతడు నాకు ప్రెజెంట్ చేసిన గీతగోవింద రేఖాచిత్రాల్ని నా హృదయంలో శాశ్వతంగా భద్రపరచుకున్నాను. ఆ ఆల్బమ్‌ని నాకిస్తూ అతను మొదటిసారిగా బయటపడిపోయాడు.

"ఏ ఘంటువుల్లోని పదాలుకూడా
నీ చెలిమి విలువను చాటలేవు
నింగి నేలా.... నిండుజాబిలి
మన మైత్రి వయస్సును దాటలేవు...."

అన్నా డతను. అతడు రాసిన ఆ మాటల్ని పదేపదే చదువు కున్నాను. మనస్సు నేదో మల్లెపూలమత్తు ఆవరించింది. ఏదో థ్రిల్.... ఎక్కడో హిమాలయా పర్వతాల్లో తేలిపోతున్నట్టుగా.... మరో ప్రపంచపు పొలిమేరల్లో తారట్లాడుతున్నట్టుగా.... పౌర్ణమి నాడు విశాఖపట్నం బీచిలో కూర్చొని సముద్రతరంగాల హోరు వింటున్నట్టుగా.... నాలో ఏవేవో ధ్వనులు....ఏవేవో లోకాలు.... ఏవేవో చిత్రరువులు....

అయినా అతన్ని ఏడిపించాలన్న నా వెర్రె ప్రయత్నాని మానలేదు.

"దీన్ని ఏం కవిత్వ మంటారు? ఫ్యూడల్ కవిత్వమా? అభ్యుదయ కవిత్వమా? విప్లవ కవిత్వమా?" అన్నాను కొంటెగా.

"పాపం - అతడు నాతో పోట్లాడే మూడ్‌లో లేదు. గుండె లోతుల్లోంచి ఉప్పొంగి ప్రవహించే అనుభూతులకు అక్షరాకృతి ఇవ్వడమే నిజమైన కవిత్వం - దానికి ఫ్యూడల్ కవిత్వమని, మరేదో కవిత్వమని పేరు పెట్టటం ఎంతకృతకంగా వుంటుందో అతనికి తెలియాలనే నేనతన్ని ఆ ప్రశ్న అడిగాను.

ఇల్లంతా ప్రశాంతంగా వుంది. వాళ్ళావిడ లేదేమో! పుట్టింటికి వెళ్ళిందేమో....అసలితనికి పెళ్ళికాలేదేమో! పెళ్ళయినా భార్యవొదిలేశాదేమో.... "మీకు పెళ్ళైందా?" అని అడుగుదామను కున్నాను. లేదు.... నేనా ప్రశ్న అడగకూడదు - ఎందుకడగాలి! అతనికి పెళ్ళయినా కాకపోయినా అతనితో నేనుచేస్తున్న స్నేహంలో ఎలాంటిమార్పూ వుండదు. కాని.... అతనికి పెళ్ళికాకపోతే....? నాహృదయం వెర్రిగా ఘూర్ణిల్లుతోంది. ఏమిటిది? ఇదంతా వట్టి స్నేహమేనా? ఈచిత్రాలు....ఈ కవిత, ఈఫీలింగ్స్, ఈపోట్లాటలు, ఈ కవ్వింపు, ఈ సంఘర్షణ.... అంతా వట్టిస్నేహమేనా? మమ్మల్ని మేము మోసగించుకుంటున్నామా? యేమో! మా మనస్సులతో దాగుడుమూతలాడుకుంటున్నామా? ఏమో.... తెలీదు....

అంతా అయోమయం....అతడలా విశృంఖలంగా మారిపోయాడేమిటి? మామధ్య విశృంఖలం రాణించదు. ఏదో వాగాల్సిందే.... మాటల ఈటెలతో ఒకర్నొకరు గాయపరచుకోవాల్సిందే.... ఏదో కసి.... ఏదో ద్వేషం.... యింకా యింకా హింసించుకోవాలి.... ఆ కసిలో, ఆ ద్వేషంలో, ఆ హింసలో-మమ్మల్ని మేము హతమార్చుకోవాలి.. మమ్మల్ని మేము కొల్లగొట్టుకోవాలి.

"నాన్నా.... అమ్మ రమ్మంటోంది."- అంటూ విక్రమ్ నోట్లోంచి వూడిపడ్డట్టుగా వున్న ఓ కుర్రాడొచ్చి నన్నిలోకంలో పడేశాడు.

సందేహంలేదు అతను విక్రమ్ కొడుకే.... ఎందుకో నా గుండెలు వణికాయి. ఎక్కడో అగాధంలో పడిపోతున్నట్టుగా ఫీలయ్యాను. ఏమిటిది? నన్ను నేను ఎందుకిలా మోసగించుకుంటున్నాను? అతనితో నాకు స్నేహంతప్ప మరేం లేదని ఇంత కాలం యింతమొండిగా ఎందుకువాదించాను? నన్ను నేను నంబాయించుకున్నాను. నేను ఈషణ్మాత్రమైనా చలించినట్టు అతనికి కనిపించదల్చుకోలేను. అతను దొంగలాగా నా ముఖకవళికలు ఎలా మారుతున్నాయో చదవటానికి ప్రయత్నిస్తున్నాడు. కాని నేను అతనికంటే పెద్ద దొంగని నా అంతరంగంలో చెలరేగుతున్న నా ఫీలింగ్స్‌ని ఆ అంతరంగంలోనే ఎలా హతమార్చుకోవాలో నాకు తెలుసు....

అతని భార్యను పరిచయం చేశాడు. అతని భార్యను చూసి నప్పుడుమాత్రం షాకై పోయాను. ఎంతో నాజూగ్గా షోగ్గా వుండే మనిషికి అటివ భార్యంటే నమ్మలేకపోయాను పూర్ మ్యాన్! అతనిమీది జాలితో నాహృదయం ద్రవించిపోయింది.

ఆమేమీ చదువుకోలేదట - పట్టి సత్తెకాలం మనిషట - ఆమెను చూడగానే నాకు అదే అనిపించింది. చాలా అమాయకంగా, నోట్లో నాలుకలేని మనిషిలా కన్పించింది. ఆమె మాకు కాఫీ యిచ్చి వంటింట్లోకి వెళ్ళిపోయింది.

"ఓ విషయం అడుగుతాను. దాంకతిరుగుళ్ళు లేకుండా నిజంచెబుతారా?"- అన్నాడు విక్రమ్.

అత దేమడుగుతాడో నాకు తెలుసు- ఎందుకో అతను నన్ను

ఆప్రశ్న అడగటం నాకేంనచ్చలేదు.

'నాకు పెళ్ళయిందని, పిల్లలున్నారని తెలిసినప్పుడు నువ్వు షాకయిపోలేదూ?" అన్నాడు.

"గో టు హెల్- నేను షాకయితేమాత్రం తన కాషయం చెబుతానని యెలా అనుకున్నాడు. ఇంతేనా, ఇతడు యింతకాలంగా నన్ను అర్థంచేసుకుంది?

చెడా మడా నాలుగు వడ్డించేశాను. తిక్క కుదిరింది పాపం- నేను అవులించకుండానే పేగులు లెక్కపెట్టానని ఒప్పుకున్నాడు.

• • • •

కొత్తగా జాయినయిన మేము నల్గురం డిపార్టుమెంటల్ టెస్ట్ ప్యాసయ్యామని తెల్సింది-

మా ఆఫీసర్ రామ్మోహన్‌రావుగారు చాలా సంతోషించారు మమ్మల్నందర్నీ కంగ్రాచ్యులేట్ చేశారు

"హార్టీ కంగ్రాచ్యులేషన్స్.... మిమ్మల్ని నేను ప్యూర్లీ ఆన్ మెరిటీ సెలెక్ట్ చేశానని ఋజువుచేశారు. మీమీద నేను చూపించిన నమ్మకాన్ని వృధాచెయ్యలేదు.... మీ సర్వీసెస్ రెగ్యులరైజ్ చేస్తారు.... సిన్సియర్‌గా, ఎఫిషియెంట్‌గా వర్క్ చేయండి.... యూ విల్ డెఫినెట్లీ రైజ్ - విష్ యూ ఆల్ ది బెస్ట్ "- అన్నారు మా ఆఫీసర్

మేం నల్గురమూ టెస్టు ప్యాసవటంతో మిగతాక్లర్కుల్లో మా ప్రతిష్ట బాగా పెరిగింది - మేం కాస్త సరుకున్నవాళ్ళమే నని వాళ్ళు అంగీకరించారు

మేం ప్యాసయినట్టు తెలిగానేఅందరూ మమ్మల్ని కంగ్రాచ్యులేట్ చేశారు. పార్టీ ఇవ్వాలని గోల చేశారు.

అందరిలాగా విక్రమ్ నన్ను కంగ్రాచ్యులేట్ చెయ్యలేదు. అతడు చెయ్యడని నాకు తెలుసు.

అందరూ "పార్టీ ఇవ్వాలి. స్వీటు తినిపించాలి...." - నా చుట్టూ చేరి గోలపెడ్తోంటే విక్రమ్ ఏదో సీరియస్‌గా పనిచేస్తున్నట్టు నటించాడు.

"చైతన్య టెస్ట్ పాసయింది తెలుసా?" - అన్నాడు మా సూపరెన్టెంట్ మాధవరావు విక్రమ్ ఆఫీసుకు రాగానే.

"ఆమె పాసవుతుందని నాకు తెలుసు" - అన్నాడు. ఇంత చిన్న విషయాన్నింత ప్రత్యేకంగా చెప్పాలా అన్న అర్థాన్ని ధ్వనిస్తూ - నాకు చిరాకేసింది

ప్రతిరోజూ పొద్దున్నే తూర్పుదిక్కున సూర్యుడుదయిస్తాడనికూడా ఆయనకు తెలుసు" - అన్నాను కసిగా.

"అది మీకు తెలిసిన విషయం కావచ్చు. సూర్యుడు ఉదయించడూ, అస్తమించడూ - భూమి తిరగటంవల్ల మనకలాంటి భ్రాంతి కల్గుతుందని మాత్రం నాకు తెలుసు...." - అన్నాడు పెద్ద భౌగోళికశాస్త్రవేత్తలా పోజుపెడ్తూ

ఇప్పుడా గొడవంతా ఎందుగ్గాని చైతన్య మనందరికీ పార్టీ ఇస్తానంటోంది.... నువ్వుకూడా పద...." - అన్నాడు దామోదరం.

"మీ అందరికీ ఇస్తానందేమో.... నాకిస్తానన్లేదే?" - అన్నాడు విక్రమ్ -

మీక్కూడా ఇస్తాను పదండి మహాశయా...." - అన్నాను, పోట్లాడితే ఇంకా బిగుసుకుపోతాడని.

"నాక్కూడా ఇస్తానని మీరేమంత విసుగ్గా చెప్పాల్సిన పన్లేదు....నాకు చాలా పనుంది - మీరు వెళ్ళి రండి - " అన్నాడు సీరియస్గా. 'కూడా' అన్న దగ్గర అదోమాదిరిగా వత్తి పల్కుతూ

ఎందుకీ మనిషి ఇలా ప్రవర్తిస్తాడు? అతన్ని నేనేమన్నానని అంత విడ్డూరంగా మాట్లాడతాడు? నాకు గొంతుదాకా కోపం వచ్చేసింది. ఎకు బాగా కోపమొస్తే కన్నీళ్ళు వచ్చేస్తాయని చెప్పానుగా....ఆ క్షణంలో నాకు కళ్ళనీళ్ళపర్యంతం అయ్యేదే....

"ఏమిటి గురూ? దీపావళికి అత్తగారింటికెళ్ళిన కొత్తల్లుడిలా అలుగుతున్నావు- ఏమిటి సంగతి?" అని రాజశేఖరం అనటంతో అంతా నవ్వారు-

వస్తున్న ఏడుపుని నవ్వుగా మార్చేశాను___

"అలిగితే అలిగాడు ... మనం వెళదాం రండి...." అంటూ వాళ్ళందర్నీ క్యాంటీన్కి తీసుకెళ్ళి వాళ్ళు అడిగిందల్లా తినిపించాను

ఐదు గంటలకి యింటికెళ్తోంటే నావెనకాలేవచ్చాడు విక్రమ్.

"కంగ్రాచ్యులేషన్స్...." అన్నాడు.

"అక్కర్లేదు"___

... ప్రామిసు చెప్పలేదు...."

"మరెందుకు చెప్పారు?"

"నాకక్కరుంది...."

"ఏమిటి మీక్కరుంది?"

"పార్టీ.... అందరికీ ఇచ్చారు. నాకు యివ్వరా?"

"ఇస్తానన్నప్పుడు మీరే రాలేదుగా? వందిరిమీద పెళ్ళి కొడుకులా పైకిపోయారుగా?"

"లేకపోతే... వాళ్ళనూ నన్నూ సమానంగా చూస్తారా?"

"చూస్తే ఏం? నీ గౌరవానికేమన్నా భంగం కల్గిందా? అందరూ సరదాగా పార్టీ యివ్వమని అడిగారు. నేనుఇస్తానన్నాను. నువ్వూ వాళ్ళతో కలిస్తే నీ సొమ్మేంపోయిందీ? పెద్ద వెటకారాలాడి నా మూడంతా పాడుచేశావు...."

"నేను రానంతమాత్రాన నీ మూడెందుకు పాడైపోవాలి?"

"ఎందుకు పాడైపోవాలా? తిన్నదరక్క..."

"ఇప్పుడరిగిందా? ఇంతకూ నాకు పార్టీ ఇస్తావా? ఇవ్వవా?"

"ఏంపార్టీ యివ్వమంటావ్?"—

"ఈరోజు మనిద్దరం పిక్చర్‌కి వెళదాం...."—

"అంతేనా?"—

"పిక్చర్‌కెళ్ళేముందు ఎక్కడైనా కడుపునిండా గులాబ్‌జామ్ తిందాం"—

"అంతేనా?"—

"పిక్చర్ చూశాక ట్యాంక్‌బండ్‌దగ్గరకెళ్ళి ఓ గంటసేపు హాయిగా కూర్చుని...."—

"ఊఁ.... కూర్చుని....?"—

"మండుతున్న గుండెల రొదల్ని విందాం...."—

"అంతేనా?"—

"అంతే! అంతకంటె ముందుకెళ్ళలేం...."—

"ఎందుకు వెళ్ళలేం?"—

"నీకు తెలుసు."—

"నాకు తెలుసని నీ కెలాతెలుసు?"—

"మాటలతో దాటెయ్యకు.... పిక్చర్‌కొస్తావా, లేదా?"—

"యిలాగే వెళ్దామా?"—

"యింటికెళ్ళి డ్రెస్‌మార్చుకోవాలా?"—

"ఆ అవసరం నాకుంటె నీకే ఎక్కువనుకుంటాను...."—

"ఫర్వాలేదు.... పద...."—

వెళ్తూ వెళ్తూ స్వీట్‌హౌస్‌లో గులాబ్‌జామ్ తిన్నాను. విక్రమ్ చాలా మూడీగా మారిపోయాడు, అతన్నలా చూడడం నాకు చాలా కొత్తగా వుంది అలంకార్‌లో 'ఫ్రెండ్స్' అన్న ఇంగ్లీషుసినిమా-యిద్దరు టీనేజ్‌ బోయ్‌ అండ్‌ గర్ల్‌ మధ్య ప్రేమ-పిక్చరంతా బ్యూటిఫుల్‌గావుంది. ఆ అబ్బాయి అమ్మాయి ఊరికి దూరంగా వెళ్ళిపోయి తమకై తాము నిర్మించుకున్న ఒక ఏకైక స్వాప్నికప్రపంచంలో నివసిస్తారు. మా మూడ్‌కు ఆ పిక్చర్ అద్భుతంగా సరిపోయింది.

పిక్చర్ అయిపోయాక ట్యాంక్‌కెళదామని విక్రమ్‌అనలేదు. అతను వెళతానని పట్టుబడితే నేనూ వెళ్ళేదాన్నే.

* * * *

వారంరోజులతర్వాత మానాన్నగారికి వైజాగ్ ట్రాన్స్‌ఫర్ అవుతున్నట్టుగా చెప్పారు.

"మా డిపార్టుమెంట్‌లో చాలా ట్రాన్స్‌ఫర్స్ వస్తున్నాయి. నన్ను వైజాగ్‌కు పోస్ట్ చెయ్యొచ్చు...." - అన్నాడు నాన్నగారు.

మీరు వైజాగ్ వెళ్ళిపోతే మరి నేను?"- అన్నాను.

"నిన్నుకూడా అక్కడకు ట్రాన్స్‌ఫర్ చెయ్యమని అడుగుదాము.... ఐ థింక్ దే విల్ ట్రాన్స్‌ఫర్ యూ టు వైజాగ్...."-

ట్రాన్స్‌ఫర్ అనగానే నాలో దిగులు.... ఈఊరు వదిలిపెట్టాలి.... ఐదారేళ్ళుగా నా జీవితం ఈ ఊరితో పెనవేసుకుపోయింది.... ఎక్కడైనా రెండుమూడేళ్ళున్నామంటే చాలు.... ఆ ఊరితో మనకేదో బలమైన అనుబంధం ఏర్పడుతుంది - ఆ ఊరిని వదిలివెళ్తున్నప్పుడు మన సర్వస్వాన్ని కోల్పోతున్నంత బాధ కల్గుతుంది.

నాన్నగారు తనకు ట్రాన్స్‌ఫర్ కాబోతోందని చెప్పిన నాలుగైదురోజులతర్వాత ఓరోజు ట్రాన్స్‌ఫర్ అర్డర్స్ వచ్చేశాయని చెప్పారు.

"నువ్వుకూడా మీ ఆఫీసులో వైజాగ్ కొక రిక్వెస్ట్ అప్లికేషన్ పడెయ్ ..." - అన్నారు నాన్నగారు

నా గుండెలు వణికిపోయాయి.

అప్పుడే ఆ ఆఫీసుతో నా కేదో లంకె యేర్పడింది.... ఆ ఆఫీసు, ఆ మనుషుల్ని వదిలి వెళ్ళిపోవల్సిందేనా? మొదట్లో మాగురించి ఏమేమో అనుకున్నప్పటికి కొద్దిరోజుల్లోనే మా ఆఫీసులో పనిచేసినవాళ్ళంతా మమ్మల్నెంతో అప్యాయంగా చూశారు. ప్రతివాళ్ళలోనూ ఏదో కొన్ని సాంఘికంగా యేర్పడే ప్రెజుడీసెస్ వుంటాయి. ఏవో కొన్ని బలహీనతలుంటాయి - వాటిని మనం అంతగా పట్టించుకోకుండా వుంటే ప్రతివాళ్ళలోను మనం మంచిని చూడచ్చు. ప్రతివాళ్ళతోనూ స్నేహం చెయ్యచ్చు. ఎక్కడున్నా పదిమందితో కలిసి బ్రతకడం నా కలవాటయింది.

నేను వెళ్ళిపోతున్నానంటే వాళ్ళంతా ఏమంటారో? విక్రమ్ ఏమంటాడో.... నేను వెళ్ళిపోతున్నాని చెప్పినప్పుడైనా తన మనసులో ఏముందో ఏమీ దాయకుండా చెబుతాడా?

తెల్లవారి ఎందుకో ఆఫీసుకు కొంచెం తొందరగా వెళ్ళాలని పించింది. నేను వెళ్ళేటప్పటికి ఇంకా ఎవరూ రాలేదు. లోపలి కెళ్ళేటప్పటికి ఏవో ఫైల్స్ చూస్తూ విక్రమ్ కనిపించాడు.

"మా నాన్నగార్కి ఈ ఊరినుండి వైజాగుకు ట్రాన్స్ఫర్ అయింది విక్రమ్.... నిన్ననే ట్రాన్స్ఫర్ ఆర్డర్స్ వచ్చాయి...." ఎందుకో అతని కా విషయం చెబుతూంటే నా గొంతులో దైన్యం తొణికిసలాడింది.

"అలాగా!" అన్నాడతను మామూలుగా.

"నేనుకూడా వెళ్ళిపోతున్నాను విక్రమ్...." నా గొంతు కొంచెం వణికింది.

కాసేపు విక్రమ్ ఏమీ మాట్లాడలేదు. సీరియస్‌గా స్మోక్ చేస్తూ గాల్లోకి రింగుల్ని వదుల్తూ ఆ రింగుల్లో ఏదో మ్యాజిక్కున్నట్టుగా పరీక్షగా వాటికేసి చూశాడు.

"వైజాగులో బీచి వుంటుందికదూ? చాలా అందమైన బీచని చెబుతారు.... ఆఫీసయిపోగానే రోజూ సాయంకాలం వెళ్ళి హాయిగా బీచిలో కూర్చుని ఎంజాయ్ చెయ్యచ్చు...."

"ఎవరూ!"

"ఎవరేమిటి, నువ్వే"

"నేనా? బీచిలో కూర్చుని ఎంజాయ్‌చేద్దామనే నేను వైజాగు వెళ్తున్నాననుకుంటున్నావా?"

"మరెందుకు వెళ్తున్నావు?"

"ఛీ, ఛీ, నీతో చెప్పటం నాదే బుద్ధితక్కువ."

"ఎందుకలా విన్ను నువ్వు నిందించుకుంటావు? మనల్ని మనం నిందించుకోవటం అంత ఆరోగ్యకరమైన అలవాటుకాదు."

"ఇప్పుడు నీసలహా ఎవరూ అడగలేదు.... నీకు చెప్పుకోవటం, ఈప్రాణంలేని గోడకు చెప్పుకోవటం-రెండూ ఒకటే."

"ఎందుకట?"

"ట్రాన్స్‌ఫర్ అయింది- వెళ్ళిపోతున్నానని చెబితే చీమ కుట్టినట్టయినా లేదు.

"చీమ కుట్టినట్టు ఎందుకుండాలి? నువ్వు వెళ్ళిపోతున్నావని తెలియగానే వెళ్ళిపోతున్నావా నిజంగా వెళ్ళిపోతున్నావా, నన్నిలా ఒంటరిగా వదిలేసి నిర్దాక్షిణ్యంగా వెళ్ళిపోతావా చైతన్యా, నీ సాన్నిధ్యంలోతప్ప మరోచోట జీవించలేని ఈ దీనుడి గుండెలచప్పుడు వినిపించుకోకుండానే వెళ్ళిపోతావా? అని తెలుగుసినిమా హీరోలా ఓ బరువైన డైలాగ్ అప్పజెప్పమంటావా?"

"అతని మాటల్లో వ్యంగ్యం, కసి, వెటకారం క్రౌర్యం.... వన్నీదో సాధించాలని....గాయపరచాలని....ఏడిపించాలి అని....

"విక్రమ్....ప్లీజ్.... నన్ను ఏడిపించాలన్న నీ మోజింకా తీరలేదా?" ఉబికివస్తున్న కన్నీళ్ళను బలవంతంగా ఆపుకున్నాను.

"ఔను....నిన్ను ఏడిపించే ఛాన్స్ మళ్ళీ దొరుకుతుందా వెళ్ళిపోతున్నావుగా?"

బయట ఎవరో వస్తున్న చప్పుడయింది. దామోదరం, మధు, సూర్యారావు, రాజశేఖరం అంతా ఒక్కొక్కరేవచ్చి తమ తమ స్థానాల్లో కూర్చున్నారు.

మా నాన్నగారికి ట్రాన్స్‌ఫర్ అయిందని, నేను కూడా వెళ్ళిపోతున్నానని వాళ్ళెవరితోనూ చెప్పాలనిపించలేదు.

లంచ్ టైంలో ఉమకు మాత్రం చెప్పాను.

"మీ నాన్నగారు వెళ్తే నువ్వుకూడా వెళ్ళాలనెక్కడుంది? నువ్విక్కడే వుండిపోవే...." అంది ఉమ.

"అది సాధ్యంకాదని ఉమకూ్కడా తెలుసు.

"ఎక్కడుండమంటావు?"

"మా యింట్లో వుండిపో"

నేను నవ్వి వూరుకున్నాను.

నేను వెళ్ళిపోతున్నట్టు ఆఫీసులో అందరికీ తెలిసిపోయింది.

"అయ్యో! మీరు వెళ్ళిపోతున్నారా? ఈ ఆఫీసు ఎంతడల్‌గా తయారైపోతుందో" అన్నాడు రాజశేఖరం.

"మీనాన్నగారు వెళ్తే వెళ్తారు.... మీ రిక్కడే వుండిపోండి- మీరు ఆఫీసులో లేకపోతే మా కేమీ తోచదండీ....". అన్నాడు దామోదరం.

సూర్యారావు, మధు, సూపర్నెంట్ మాధవరావు అందరూ అలాగే అన్నారు.

మొదట్లో వాళ్ళెవరన్నా నా కంతమంచభిప్రాయం వుండేది కాదు స్త్రీలని ద్వేషిస్తారని, స్త్రీలమీద లేనిపోని పుకార్లను పుట్టిస్తారని అసహ్యించుకునేదాన్ని, కాని వాళ్ళందరూ నాకిప్పుడు ఎంతో దగ్గరయినట్టుగా ఫీలవుతున్నాను. వాళ్ళను వదిలి వెళ్ళటం అంటే ఆత్మీయులను వదిలివెళ్తున్నట్టుగా బాధకల్గింది.

నేను వెళ్తున్నట్టు తెలియగానే సుల్తానాకు కళ్ళనీళ్ళు వచ్చేశాయి. లీలమాత్రం 'అయ్యో! వెళ్ళిపోతున్నారా'- అని వూరుకుంది.

నాన్నగారు వెళ్ళి వైజాగ్‌లో జాయినయ్యారు. నా ట్రాన్స్ఫర్‌కోసం హైదరాబాదులో ఎవరికో చెప్పొచ్చాను, త్వరలోనే వస్తుందని చెప్పారు. ట్రాన్స్ఫర్ ఆర్డర్సు రాగానే నన్ను రిలీవై రమ్మని చెప్పి నాన్నగారు, అమ్మ, స్రవంతి వైజాగ్ వెళ్ళిపోయారు నాకు కంపెనీగా తమ్ముడు సాందీప్‌ను ఇక్కడే వుంచి వెళ్ళారు. నా ఆర్డర్స్ వచ్చి నేను రిలీవైపోయేవరకు మేముంటున్న యింట్లో వుండేట్టుగా నాన్నగారు ఏర్పాటుచేసి వెళ్ళారు.

తీరిక దొరికినప్పుడల్లా విక్రమ్ ఇచ్చిన గీతగోవింద చిత్రాల

ఆల్బమ్ చూస్తూ ఆ ఆల్బమ్‌ల [illegible]
చదువుతూ గడిపేదాన్ని.

రోజులు లెక్కపెట్టుకుంటూ ఆఫీసుకు వెళ్ళొస్తున్నాను. నేను వెళ్ళిపోతున్నానని తెల్సినప్పట్నుంచి విక్రమ్ నాముంది తప్పించుకు తిరుగుతున్నాడు.

* * * *

పదిరోజుల్లో నా ట్రాన్స్‌ఫర్ ఆర్డర్స్ వచ్చేశాయి ఆర్డర్స్ వచ్చిన తెల్లవారే నన్ను రిలీవ్ చేశారు మాకొలీగ్స్ అందరూకలిసి నాకు ఫేర్‌వెల్ పార్టీయిచ్చారు.

మా ఆఫీసర్ నా గురించి కాసేపు మాట్లాడారు

"చైతన్య చాలా తెలివైన అమ్మాయని ఆమెను ఇంటర్వ్యూ చేసినప్పుడే గ్రహించాను. ఎప్పుడూ ఉత్సాహంగా తపచట్టూ వున్న వాళ్ళను నవ్వుతూ నవ్విస్తూ - రొటీన్‌గా, డల్‌గా గడిపే ఆఫీసు జీవితాన్ని లైవ్లీగా మార్చింది చైతన్య. తన కిచ్చిన పనినికూడా సిన్సియర్‌గా చేసింది. ఆమెలాంటి సమర్థురాలైన ఉద్యోగిని కోల్పోవటం నిజంగా మన దురదృష్టం కాని ఉద్యోగమన్నప్పుడు ట్రాన్స్‌ఫర్ తప్పదు - ఆమె వెళ్ళిపోవటం మన ఆఫీసుకు నష్టమే అయినా వేరే ఆఫీసుకు లాభమవుతుందని మనం మరచిపోకూడదు. ఆమె ఎక్కడికివెళ్ళినా తన తెలివితేటలతో, తన ప్లెజెంట్ టెంపర మెంట్‌తో అందరి అదరాభిమానాలను చూరగొంటుందన్న నమ్మకం వుంది. ఐ విష్ హర్ ఎ హాపీ అండ్ ఛీర్‌ఫుల్ లైఫ్ ఎట్ హర్ న్యూ స్టేషన్" అని ముగించాడు.

"ఇంకెవరైనా మాట్లాడ్తారా?" అని మా ఆఫీసర్ అడిగి నప్పుడు విక్రమ్ లేచాడు.

"చైతన్య వెళ్ళిపోతున్నదని తెలిసినప్పుడు నా మనసు పొందిన వివిధగతులకు అక్షరరూపం ఇవ్వాలని నేను చేసిన వ్యర్థ ప్రయత్నం ఈ గేయంగా మారింది. అదిప్పుడు చదువుతాను.

అశల గ్రుడ్డిదీపాలు ఆరిపోగా
ఆశయాలు మనసునుండి పారిపోగా
హృదయపు గదిలో ఏం మిగిలింది? చీకటితప్ప.
చను రింకిపోయి చాలా రోజులైంది.

ఎత్తి తీసుకుపోయే మరెన్ని గంటలైంది.
ఈ మనసు ప్రమిదలో ఇంకేం మిగిలింది?
నన్నవి పగులు తప్ప.
నాకు తెలుసు - ఆగమన మున్నప్పుడు
నిర్గమనము తప్పదని
వెళ్ళే నిన్ను చూసి లేని నవ్వు తెచ్చుకుంటే
అది నా మొహానికి నప్పదని
నాకు తెలుసు-తెగిన తీగల విరిగిన వీణపై
ఇక ఏ రాగాన్ని పలికించ లేనని
కాలం కాళ్ళరగ్గొట్టి, ఈ క్షణాన్ని
శాశ్వతం చెయ్యలేనని
నీ వెక్కడో - నే నెక్కడో
మళ్ళీ మనం కలిసే దెక్కడో
నిశ్శబ్ద వీధిలో న న్నొంటరిగా వదిలేసి
దీపం లేకున్నా వెళ్ళిపోగలవులే
బాధాతప్తహృదయపు మండే వెలుతురులో
నీ దారి సుగమమేలే.
మరపు మత్తుకు బానిసను కావాలనుంది
జ్ఞాపకాల ధనరాసుల్ని కొల్లగొట్టుకు వెళ్ళిపో -
జ్ఞాపకాల గుడిగంటలింక వినలేను
మరపు మధుశాలలో త్రోసి వెళ్ళిపో -
మరపు చీకటిలో మ్రగ్గిపోవాలనివుంది
జ్ఞాపకాల దీపాల్ని ఆర్పుతూ వెళ్ళిపో -
పోతున్నావా నేస్తం - వెళ్ళిపోతున్నావా?
అనుభవాల ఐశ్వర్యాలతో
అంతకుమించిన ఆత్మస్థైర్యంతో
నీవు ముందుకు పోవాలనే వుంది - కాని
వెనక్కి చూడమంటున్నాను
స్నేహమాధుర్యానికి తలవంచింది -
మిత్రుత్వపు గొప్పదనానికి సగర్వంగా తలయెత్తింది -
నీకదనే నీతోనే -

అందుకే - గుండెల్లో ఎప్పుడూ
భద్రంగా బంధింపబడిన నీచిత్తరువును
తలవంచే చూసుకుంటాను వినమ్రతగా -
మనసుచెదరి - మగత నాదిలి
జీవితపు బాటలో పరుగెత్తే ప్రయాణీకుడికి
చక్కటినీడ - చల్లనిపీదు
దొరికినట్టుగా వుంది నానస్థితి యిప్పుడు
స్వచ్ఛమైన జీవితంలో నీ వియోగవిశాంతాలు
జీవన పత్రాలమీద విరీవరంగవల్లులు
ప్రాణం పోయేటప్పుడు ప్రాణిపడే వేదనలాంటి
సమాధానంలేని ప్రశ్న నన్ను యాతనపెడ్తోంది -

—విక్రమ్ చదవడం పూర్తిచేసి వెళ్ళిపోయాడు. విక్రమ్ చదివిన ప్రతిమాటా ఈటెగా మారి నా గుండెల్లో గుచ్చుకుంది. అతడలాగే చదువుతూ వుండిపోతే.... కాలం అలాగే స్తంభించిపోతే బాధకూడా ఇంతమధురంగా వుంటుందని నాకిప్పుడే తెలిసింది.

అందరూ నిశ్శబ్దంగా విన్నారు.

అందరి హృదయాలూ కొన్నేపు బాధగా మూల్గాయి. అందరూ కొన్నేపు దైనందిన జీవితంలోని రొటీన్‌కు అతీతమైన మానసికస్థితినేదో చేరుకున్నారు. హృదయంలో కలం ముంచిరాస్తే వెలువడే కవిత్వం ఎలావుంటుందో వాళ్ళు రుచి చూశారు.

స్నేహంలో మాధుర్యం ఏమిటో చవి చూశారు

విక్రమ్ ఆ పంక్తుల్ని చదవడం కూడా ఎంత అందంగా చదివాడు. ఆ క్షణంలో అతని గొంతులో పొలికిన ఫీలింగ్నూ, బాధను ఈజన్మలో మరచిపోలేను.

ఆ తర్వాత నన్ను మాట్లాడమన్నారు.

నా గొంతు మూగవోయింది నా హృదయం స్తంభించిపోయింది నాకు మాటలు రావు. మాట్లాడే ప్రయత్నం చేస్తే వచ్చేవి మాటలు కావు. కన్నీళ్ళు. నా సర్వశక్తుల్నీ కూడతీసుకుని లేచి నిల్చున్నాను.

"మీ అందర్నీ వదిలి వెళ్ళిపోతున్నాను. మీరంతా నాపట్ల చూపించిన ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు చెప్పటానికి నాకు

ఒ ఓడు రావటం లేదు. ఎక్కడెక్కడినుంచో వచ్చాం. ఇక్కడ కలుసుకున్నాం. స్నేహంలో వుండే మాధుర్యాన్ని చవిచూశాం. పది మందిమి ఒకచోట కలిసి పనిచెయ్యటంలోవుండే ఆనందాన్ని అను భవించాం.... నాపట్ల ఎనలేని వాత్సల్యాన్ని చూపిన ఆఫీసర్ గార్కి, మీ అందరికీ కన్నీటితో వీడ్కోలు చెప్పి వెళ్ళిపోవటం కంటే నే నేంచెయ్యగలను? నే నెప్పుడైనా దురుసుగా మాట్లాడి ఎవరైనా నొప్పించి వుంటే ఈ పిచ్చిదాన్ని క్షమిస్తారుకదూ?"

గుండెలోతుల్లోంచి ఉబికివస్తున్న కన్నీటిని ఆపుకోలేక నా సీట్లో కూర్చుండిపోయాను

మరోసారి అందరూ 'విష్ యూ బెస్టాఫ్‌లక్' అని చెప్పి వెళ్ళిపోయారు.

"రేపు తొమ్మిదిన్నరకు గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో వెళ్ళిపోతు నని విక్రమ్‌కు చెబుదామనుకున్నా. కాని అతడు కన్పించలేదు. అతడు రాసిన ఆ పంక్తుల్ని నాకివ్వమని అడుగుదామనుకున్నాను. కాని అతడు మాయమైపోయాడు.

విక్రమ్ ఏమైపోయాడు?

చదవగానే వెళ్ళిపోయాడన్నారు- రేపు వెళ్ళిపోతున్నానని చెబుదామని వాళ్ళింటిదాకా వెళ్ళాను.

ఇంటి కింకా రాలేదని బయటే ఆడుకుంటున్న వాళ్ళబ్బాయి చెప్పాడు.

వెళ్ళేలోగా విక్రమ్‌ను మరోసారి చూస్తానా? మరోసారి కడుపునిండా మాట్లాడ్తానా?

లేదు.... విక్రమ్ యిక కన్పించడు.... విక్రమ్ స్టేషన్ దాకా వస్తే యెంతబాగుండును! కాని....రాడని నాకు తెలుసు.

* * * *

నేను, తమ్ముడూ రాత్రి తొమ్మిదిగంటలకు కాజీపేట స్టేషన్ చేరుకున్నాం.... వెళ్ళగానే యెక్కడైనా విక్రమ్ వున్నాడేమోనని స్టేషనంతా వెతికాను. లేదు.... ఎలావుంటాడు? తిక్కమనిషి. అకస్మాత్తుగా నా మనసంతా అతనిమీది కోపంతో నిండిపోయింది.

పోన్లే - అతనికి లేని ఆ యిది నాకెందుకు? నేనే వట్టి పిచ్చిదాన్ని.

స్టేషన్ ప్లాట్‌ఫాంమీద ఒక్కొక్కళ్ళు [illegible]

ప్లాట్‌ఫాంమీద జనం యెక్కువవుతున్నారు.... ట్రెయిన్ టైం దగ్గర పడ్తోంది.

విక్రమ్ రాడా? 'నిజంగా రాడా? ఈ ఆఖరుక్షణాల్లోనైనా ఒక్కసారి కన్పించడా? కఠినం చివరిసారిగా ఏడిపించటానికైనా రాడా? అతడు రాలేదన్న భావన నాగుండెల్ని శాశ్వతంగా తొలిచి వెయ్యాలనే అతడు రావటంలేదు. ఎంతనిర్దయుడు? ఎంతక్రూరుడు? మరి అలాంటివాడు నన్ను ఆ కవిత్వమంతా యెందుకొలకబోసినట్లు? నన్ను ఏడ్పించటానికేనా?

"ట్రెయిన్ లేటేమీ లేదక్కయ్యా.... రైట్ టైమ్‌కే వస్తుంది." అన్నాడు సందీప్ - " - ఇంకా ఇరవై నిముషాలు టైముంది - కాఫీ తాగుదామా?".

"అక్కర్లేదులేరా... సామానెక్కించటానికి కూలీనిచూడు"-

"కూలీని మాట్లాడేశానక్కయ్యా!"-

"సరే. నువ్వెళ్ళి కాఫీతాగిరా వో- నే నిక్కడే వుంటాను"- అన్నాను.

సందీప్ వెళ్ళాడు

నాకళ్ళు ప్లాట్‌ఫామంతా వెతుకుతున్నాయి. కాని ఎక్కడా విక్రమ్‌ను పోలిన మనిషెవరూ కన్పించలేదు.

"ట్రెయిన్ రైట్‌టైంకే వస్తుందికదూ!" - ఉలిక్కిపడ్డాను. నావెనుకే విక్రమ్!

"ఔను.... నువ్విప్పుడా రావటం!"-

ఇప్పటికైనా వచ్చినందుకు సంతోషించు".

"ఎందుకు సంతోషించాలి? నీకోసం ఇక్కడెవరూ క్షణ మొక యుగంగా ఎదురుచూడటంలేదు....".

"నువ్వు ఎదురుచూస్తున్నావని నే నేం రాలేదిక్కడికి. మా ఫ్రెండొకడు కాకినాడ వెళ్తోంటే వాణ్ణి ట్రెయినెక్కిద్దామనివచ్చాను. కన్పించావుకదాఅని పలకరించాను....".

"చాలా గొప్పపనిచేశారు.... వెళ్ళండి మీ ఫ్రెండ్‌దగ్గరకే వెళ్ళండి....".

"అలాగే వెళ్తాను.... ఎలాగూ కలిశావుకదా.... నీతో లాస్ట్

"అక్కర్లేదు...."

"నిన్ను బతిమాలేంత టైంలేదు.... చెయినొచ్చేస్తోంది.."

"నన్ను బతిమాలమని నిన్నేం కోరుకోలేదు".

"చైతన్యా" అన్నాడతను బాధగా, అసహనంగా.

నిశ్శబ్దంగా అతనివెంట నడిచాను. అతని చేతిలో ఏదో పాకెట్టుంది. ఏమిటది?

క్యాంటీన్లో కెళ్ళి కూర్చున్నాం. రెండు కాఫీలు తెమ్మని చెప్పా డతను. "నిన్న నువ్వు చదివిన ఆ కవిత.... నా క్కావాలి."

"నా కవితను నీ కెలా యిస్తాను?"

"ఇవ్వాలి.... అంతే?"

"శాసిస్తున్నావా?"

"ఔను."

"నన్ను శాసించే హక్కు నీ కెవ రిచ్చారు?"

"నువ్వే యిచ్చావు."

ఇద్దరమూ కాఫీ సిప్ చేస్తున్నాము.

అత డేమీ మాట్లాడటంలేదు.

"ప్లీజ్.... ఏదన్నా మాట్లాడండి.... మీరు నిశ్శబ్దంగా వుంటే నేను భరించలేను."

"కొన్నింటిని భరించక తప్పదు."

"ఇప్పుడైనా కాస్సేపు మీ మొండితనాన్ని కట్టిపెట్టి కాస్త ఈ మనసుకు ఉపశమనాన్ని కల్గించే మాటలు మాట్లాడకూడదూ?"

"అలాంటి మాటలు నాకు రావు."

"ఏడిపించే మాటలుమాత్రం బాగా వచ్చు."

"నువ్వు వెళ్ళేలోగా నిన్ను మరోసారి ఏడిపించాలని వుంది."

"ఔను.... నువ్వొస్తే సరిగ్గా అందుకే వస్తావని నే ననుకుంటూనే వున్నాను."

"నువ్వలా అనుకుంటావని నాకు తెలుసు..బిల్లు మీ రిస్తారా, నన్నివ్వమన్నారా?"

"విక్రమ్.... ప్లీజ్."

బిల్లు చెల్లించి బయటకొచ్చాడు విక్రమ్.

"ప్రేయసి కింకా ఏదివ్వగలడు ప్రియుడు [illegible].

విక్రమ్ ఏమీ మాట్లాడలేదు. రెండు మాటలు, రెండు కమ్మటి మాటలు.... మనసుమీద పన్నీటిజల్లుల్ని కురిపించే మాటలు.... రావు! అతని నోటినుంచి అలాంటిమాటలు రావు.

"విక్రమ్....ఆఖరుసారిగా అడుగుతున్నాను....నువ్వు రాసిన ఆ కవితను నా కివ్వవూ?"

"ఎందుకు? ఆ పిచ్చిరాతల్లో ఏముంది?"

"అదంతా నీ కనవసరం...."

"సరే.... నీ కవసరం అయితే తీసుకో."

చేతిలోవున్న పాకెట్ తీసి నాకిచ్చాడు.

"ఇదో లెటర్ ప్యాడ్. కాళిదాసు మేఘసందేశంలోని కవిత్వానికి ఓ ఆర్టిస్టు ఈ లెటర్‌ప్యాడ్‌లోని ప్రతికాగితంమీద చిత్రాలు గీశాడు—ఇలాంటి చిత్రా లంటే నీకు చాలాయిష్టంకదూ?"

"బ్యూటిఫుల్ ఆర్టు!"

"....ఈ లెటర్‌ప్యాడ్ ను వ్వో షరతుకు వప్పుకుంటే నీ [illegible]ను...."

"ప్రెజెంట్ చేసేవా శ్చెవరూ షరతులు పెట్టరు...."

"కాని నేను పెడుతున్నాను. ఈ కాగితంమీద నాకు మాత్రమే లెటర్స్ రాయాలి."

"ఎంతస్వార్థం!"

"ఔను.... నేను స్వార్థపరుణ్ణే!"

"వేరేవాళ్ళకు రాసినట్టు నీ కెలా తెలుస్తుంది?"

"చాలా సులభంగా తెలుస్తుంది.... ఇందులో సరిగ్గా వంద కాగితా లున్నాయి.... మొదటి రెండుకాగితాలమీద నిన్న నేను చదివిన ఆ పీసెస్ రాశాను. 98 కాగితా లుంటాయి.... నీనుండి నా కొచ్చే ప్రతిలెటర్లో ఎన్నికాగితాలున్నాయో లెక్కపెట్టుకోగలను."

"ఇంకెవరికైనా రాశాననుకో.... ఏంచేస్తావు?"

"నీకు లెటర్స్ రాయటం ఆపేస్తాను...."

"అంతేనా?"

"అంతే."

"నీకు రాసిన లెటర్స్‌ని మీఆవిడ చూస్తే?".

... ఏం: తెలుగు ముద్దుల మధ్యే కూర్చోపెట్టి మనిద్దరం ఓ గంటసేపు మాట్లాడుకున్నా ఆమెకు మన మేంమాట్లాడుకున్నామో బోధపడదు.... ఇక ఉత్తరమా?"-

"ఏం.... ఆమెకు తెలుగురాదా?"

"ఆమె కొచ్చిన తెలుగుకు మనం మాట్లాడుకునే తెలుగుకు చాలా తేడావుంటుంది...."

"ఆమెను కాస్త సంస్కరించే ప్రయత్నంఎందుకు చెయ్యరు?

"ఔవియ్ చైతన్యా! ఆవిషయం ఇప్పుడెందుకు? మాయింటిని, మా యింటి వాతావరణాన్ని సాధ్యమైనంతవరకుమరచిపోయే ప్రయత్నం చేస్తుంటాను.... నే నెప్పుడూ నాకై నేను రచించుకున్న ప్రపంచం లోనే బ్రతికే ప్రయత్నం చేస్తుంటాను....".

"అంటే?"-

"తెలుగులోనే చెప్పానుగా....?".

"అక్కయ్యా! ట్రెయినొచ్చేస్తోంది...." అంటూ నందీ పరిగెత్తుకుని వచ్చాడు.

"నాక్కూడా తెలుగురాదేమో?"

"ట్రెయినొచ్చేస్తోంది.... విష్ యూ ఎ హాపీ జర్నీ అని చెప్పలేను."

"ఏం?".

"నేను స్వార్థపరుణ్ణి.... నేను దుఃఖపడుతుండగా వేరేవాళ్ళు హాయిగావుంటే ఓర్వలేను...."

"ఆ వేరేవాళ్ళుకూడా దుఃఖించటంలేదని మీ కెలాతెల్సు?"-

ప్లాట్ఫామంతా రద్దిగామారిపోయింది, జనంలో కలకలం.. అందరూ అటూ యిటూ పరుగెత్తుతున్నారు. మేం మాట్లాడుకునే మాటలు ఒకరివొకరికి విన్పించడంలేదు.

ట్రెయి నొచ్చి ఆగింది మేము రిజర్వ్ చేయించుకున్న బెర్త్లున్న కంపార్టుమెంట్ వెతుక్కుని కూర్చునేటప్పటికి పది నిముషాలు పట్టింది.

అంతకంతకూ నా గుండెలు బరువెక్కుతున్నాయి.

అతను ప్లాట్ఫాంమీద నిల్చున్నాడు.

అతనిలో ఎలాంటిచలనం లేదు.

అత దేమీ మాట్లాడటంలేదు.

సామానంతా ఎక్కించి నేందిప నా ప్రక్కనే కూర్చున్నాడు.
గార్డు విజిల్ వూదాడు.
"సముద్రం వక్కకు వెడుతున్నావు. ఓ నీటిచుక్కలాంటి నేను గుర్తుంటానా?"
అత నామాట అవగానే నాగుండెకు గండివడినట్లుగా కన్నీళ్ళ ప్రవాహం.
అలా ఏడుస్తూనే - "మీ కోరిక తీరింది. ఏడిపించారు" అన్నాను.
అత నేం మాట్లాడలేదు.
మెల్లగా ట్రెయిన్ కదిలింది. అతడు చెయ్యి వూపాడు.
నేను నిశ్శబ్దంగా ఏడుస్తున్నాను.
రైలు వేగాన్ని పుంజుకుంది.
నా గుండెల్లో విప్పటి అతని మాటలు గింగురుమంటున్నాయి.

"నీ వెక్కడో - నే నెక్కడో
మళ్ళీ మనం కలిసేదెక్కడో
నిశ్శబ్ద వీధిలో వ న్నొంటరిగా వదిలేసి
దీపంలేకున్నా వెళ్ళిపోగలవులే
బాధాతప్త హృదయపు మందే వెలుతురులో
నీ దారి సుగమమేలే—
మరపు మత్తుకు బానిసను కావాలనుంది
జ్ఞాపకాల ధనరాసుల్ని కొల్లగొట్టుకు వెళ్ళిపో
జ్ఞాపకాల గుడిగంట లింక వినలేను
మరపు మధుశాలలో త్రోసి వెళ్ళిపో
మరపు చీకటిలో మ్రగ్గిపోవాలనివుంది
జ్ఞాపకాల దీపాల్ని ఆర్పుతూ వెళ్ళిపో—

(సమాప్తం)



పుట్టినతేది : 24-12-1941

జన్మస్థలం : వావిలాల, జనగామ తాలూకా, వరంగల్ జిల్లా.

విద్యాభ్యాసం : బి ఏ. వరకు వరంగల్‌లో, ఎం.ఏ. హైదరాబాద్

ఉద్యోగం : కరీంనగర్ ఎస్. ఆర్. ఆర్. డిగ్రీ కళాశా
ఎకనమిక్స్ లెక్చరర్.

రచనలు : కాలేజి విద్యార్థుల సమస్యలను, మనస్తత్వా
చిత్రిస్తూ రాసిన "అంపశయ్య" మొదటినవల. 19
వెలువడింది.

'ముళ్ళపొదలు', 'విచలిత', 'అగాధాలు', 'చీకటిరోజులు', నాత
నవలలు. 'సౌజన్య'. 'సంకెళ్ళు', 'కాటేసిన కాల
అన్న నా నవలలు "స్వాతి"లోనే ప్రచురించబడ్డాయి.

నా కథ "హత్య"కు 1973లో ఆంధ్రజ్యోతి ఉగాది కథలపో
ప్రథమబహుమతి లభించింది.

"లైఫ్ ఇన్ ఎ కాలేజి" అన్న కథలసంపుటికూడా వెలువడిం

అనేక విమర్శనాత్మకవ్యాసాలను, రేడియోనాటికలనుకూడారచిం

శ్రీశ్రీ కవిత్వాన్ని, బుచ్చిబాబు కథల్ని, చలం శైలిని, భావా
అభిమానిస్తాను.

—న



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M146 |
| పుస్తకం పేరు | స్వాతి ముత్యాలు |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 107 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Susmitha |
| పేజీలు విడదీసినది | Thulasi |
| స్కాన్ చేసినది | K V Bhanu Sree |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good. |